**Recommended** for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide. Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.



శ్రీ [illegible]

కార్యదర్శి :

హైదరాబాదు హిందీ ప్రచార సంఘము.

# ఈ సంచికలో





# స్రవంతి - సూచనలు

1. స్రవంతి ప్రతినెల 10 వ తేదీన చందాదార్లకు పంపబడును.
2. ఉత్తర ప్రత్యుత్తరములు జరుపునపుడు ప్రతి చందాదారూ తనకు నిర్ణయింపబడిన సంఖ్యనుగూడా తెలియ జేయవలెను.
3. కనీసం మూడునెలలైనా వరుసగాలేనిది చిరునామా మార్పు అంగీక రించబడదు. చిరునామా మార్పును కోరువారు తగినంత ముందుగా కార్యాలయమునకు తెలియజేయవలెను.
4. సమీక్షకు పుస్తకములను పంపువారు రెండు ప్రతులను తప్పక పంపవలెను. పుస్తకములను పంపినవారు వెంటనే సమీక్షను ప్రచు రించమని ఉత్తరములువ్రాసి ప్రయోజనం లేదు. వీలువెంబడి అన్ని పుస్తకములూ సమీక్షించబడగలవు.
5. రచయితలు తమ రచనలను కాగితమునకు ఒకవైపుననే వ్రాసి పంపవలెను. అక్షరములు సాధ్యమైనంత స్పష్టంగా ఉండడం గూడా అవసరము.
6. తమ రచనలను తిరిగి పంపమని కోరువారు 0—2—0 తపాలా బిళ్ళలు పంపవలెను.

---

# హిందీ ప్రచార సమ్మేళనం

మహబూబునగరం జిల్లా ద్వితీయ హిందీ ప్రచార సమ్మేళనం రాబోవు నవంబరు నెలలో రఘుపతి పేటలో జరుగ నున్నది. ఆహ్వాన సంఘం ఏర్పడినది. పలువురు పండితులు, కవులు, కళా కారులు, హిందీ ప్రచారకులు, నాయకులు సమ్మేళనంలో పాల్గొన గలరు.

టెలిగ్రామ్: హిందీసంఘ ఫోన్ : 4406

సంవత్సర చందా రు. 2-0-0 విడిప్రతి రు. 0-4-0

# స్రవం

సంపుటి ౨ | సెప్టెంబరు, 1955 | సంచిక ౬

*సంపాదకీయం :*

గోవా స్వాతంత్ర్యోద్యమంలో
అసువులు బాసిన
స్వాతంత్ర్యవీరుల
స్మృతి చిహ్నముగా........

........................

# పుస్తక స్వీకారం

| | | | |
|---|---|---|---|
| 1. శ్రీమద్భాగవత మహిమ | రచన: | మిన్నికంటి గురునాథశర్మ, | గుంటూరు. |
| 2. శ్రీమద్గురు భాగవతము | ,, | ,, | ,, |
| 3. సుమాంజలి | | | హైద్రాబాదు. |
| 4. పరిణతి | రచన: | స్ఫూర్తిశ్రీ | కాకినాడ. |
| 5. కథలు రాయడ మెలా ? | రచన: | కొంతి కృష్ణమూర్తి | వరంగల్లు. |
| 6. విశ్వం పెళ్లి | రచన: | సోమంచి యజ్ఞన్నశాస్త్రి | బొంబాయి. |
| 7. రంగభూమి | ,, | ,, | ,, |
| 8. న్యాయం | ,, | ,, | ,, |
| 9. లోకులు కాకులు | ,, | ,, | ,, |
| 10. పెద్ద మనుషులు | ,, | ,, | ,, |
| 11. బాపూ | రచన: | శ్రీ విద్యాపతి | సికింద్రాబాదు. |
| 12. రాజరాజు | రచన: | ఈరంకి వెంకట రమణమూర్తి | సికింద్రాబాదు. |
| 13. హృద్గీత | రచన: | సంపత్కుమారాచార్య సుప్రసన్నాచార్య | వరంగల్లు. |
| 14. ఆనందమఠం | రచన: | స్ఫూర్తిశ్రీ | కాకినాడ. |
| 15. మిథ్య బ్రతుకులు | రచన: | ఇసుకపల్లి లక్ష్మీ నరసింహశాస్త్రి | హైద్రాబాదు. |
| 16. పతిత | రచన: | మిత్రశ్రీ | కర్నూలు. |
| 17. విరాళాప్రొడక్షన్ నెం. 1 | రచన: | వేణు | గూడూరు. |
| 18. శ్రీకృష్ణుని గీతావాణి | రచన: | వి. కృష్ణారావు | ఆరుట్ల. |
| 19. రత్నమాల | రచన: | కోగంటి దుర్గా మల్లికార్జునరావు | పామర్రు. |

# పత్రికా స్వీకారం

| | | |
|---|---|---|
| 1. అభ్యుదయ | — | విజయవాడ |
| 2. జ్యోతి | — | మద్రాసు |

కవిత:

# పదిహేను అగస్టు

— శ్రీ సి. నారాయణరెడ్డి

దాస్య నిగళ బద్ధ భార
త ప్రజా భుజాగ్రమ్ముల
నింగివరకు పొంగించిన
బంగారు దినమ్ము నేడు
పదిహేను అగస్టు నేడు.
సంద్రా లవతలి వారలు
స్వార్థసిద్ధికై నడపిన
పరిపాలన శకటము దిగ
బడి పోయిన గడియ నేడు
పదిహేను అగస్టు నేడు.
ప్రజాస్రవంతికల నాపగ
పాలకవర్గము నిల్పిన
మరఫిరంగుల గొంతుకలను
మంచులు పేరినవి నేడు
పదిహేను అగస్టు నేడు.

సూర్యుడు గ్రుంకని విస్తా
రోర్వీతలమందు వేళ్ళు
దన్ని విటారుగ నిల్చొను
ఉన్నత సామ్రాజ్య వృక్ష
మూలమ్ములను పెకలించిన అ
పూర్వ గర్వదినము నేడు
పర్వ పదృక్ దినము నేడు
పదిహేను అగస్టు నేడు.
హిమాచల శిరమ్మునుండి
హిందూ సాగరం వరకు
మొలిచిన బానిస తనంపు
ముళ్ళ కంపలను దహించి
విమల స్వేచ్ఛా సురభిళ
సుమవృష్టిని గురిపించిన
మధుర సుధా ఘటిక నేడు
పదిహేను అగస్టు నేడు.

పదిహేను అగస్టు నాటి
పర్వదినము సమస్త జా
తుల గుండెలు పచ్చని దు
స్తులతో కలకలలాడెను.
భవనాగ్రములపై రెపరె
ప లాడు మువ్వన్నియ జెం
డాల వోలె ప్రజల అభీ
ష్టాలు పల్లటీల్ వేసెను.
తనదరస్మితమ్ముల తో
ద నిశాత కృపాణమ్ముల
మొండి పరచిన మహోన్నత
మూర్ధన్యుడు అనన్యుండు
బాపూజీ స్వప్నమ్ములు
పరిపూర్ణా కృతులలోన
సాక్షాత్కారము బొందెను
'జనగణమన'ములు పొంగెను.

"పదిహేను అగస్టు మనకు
ప్రసాదించె నలుగురిలో

తలయెత్తుక తిరిగెడు స్వా
తంత్ర్యమ్మను మాట నిజము
మనము శిరమ్మెత్తెడు స్వే
చ్ఛను పొందినయంత మాత్ర
మున మన క్లేశ గ్రంథులు
పుటుకున తెగిపోయినవా ?
జీవన మార్గమ్ముల మూ
సిన దారిద్ర్యాంధకార
మప్పుడే ప్రభాత హిమ
మ్మట్లు విచ్చి పోయినదా ?"
ఈదృశ సందేహాత్మక
నాదమ్ములు, వాదమ్ములు,
వినిపించెను అస్పష్టము
గ నెవ్వరో పల్కినటుల.

నిజము నిజము మనజీవన
విశీధ వాటిక లందున
విందు పున్నమ వెన్నెలలు
నిత్యము వికసించలేదు.
కాదనగలమా మరి ? మన
కాళ్ళక్రింద పువులేమో
కావి వాడివాడి కంట
కాలె నలిగిపోవుచుంట.
అంతమాత్రముననే నై
రాశ్యము చెందంగ వలదు.
ఉదయాచల తుంగ శృంగ
దిదృశ్ మావంగ వలదు.

వేచియుంద మద్యతన ని
విష్యత్తున మన బ్రతుకుం
దోటలలో వెన్నెల గు
త్తులు విచ్చెడు దినమున్నది.
అపుడే మన నదులు చంచ
లాత్మల బంధనముచేసి
ప్రజలకు సౌఖ్యశ్రీలసు
పంచుటకై నిల్చున్నవి.
లోలోపల మిగుల రగు
ల్కొనెడు విశ్వయుద్ధాగ్నుల
నార్పుటకై మనదేశ
మ్మపుడె నడుము బిగించినది
ప్రాక్పశ్చిమ దిశల నొక్క
పర్యాయము వెలిగించెను
మధ్యందిన భాస్కరుండు
మనవాడు జవాహరుండు.
అతడు విశ్వశాంతి మహా
యజ్ఞమునకు ఋత్విజుండు
అతడు విడిన భూ ఖండము
లతికించిన మాంత్రికుండు.
అతడు వెల్గించిన స్నే
హ ప్రదీప కాంతులలో
మనము వజ్ర సంకల్ప
మ్మున పురోగమించినాము.
మన దేశ మ్ముదయోన్ముఖ
మహా ప్రయాణమ్ములోన
మైళ్ళు గడచి పోయినట్టి
మాటను కాదనగ లేము.
అయిన మనము మన ధ్యేయపు
టంచులు చుంబించువరకు
నిద్దురించ వల దించుక
విశ్వసించ వలదు.

★

నా టి క :

# ఓటమి తరువాత

మూలం : శ్రీ కృష్ణచందర్

అనువాదం : శ్రీ చావలి రామచంద్రరావు

( గత సంచిక తరువాయి )

[మేయరు భవనంలో పెద్ద హాలు ఆఫీసర్ల నివాసానికై ఖాళీ చేయబడింది. హాలులో ప్రవేశించగానే కొయ్యతోనూ, పరదాలతోనూ అమర్చబడి ఉత్తరపు వైపు గోడనుండి దక్షిణపు గోడవరకూ వ్యాపించిన గదుల వరుస దృష్టి నాకర్షిస్తుంది. వాటిలోనే శత్రువుల మిలిటరీ ఆఫీసర్లనివాసం. ఆ గదుల కివతల భోజనం చేసే మేజాలూ, చీట్లాడే డ్రాయర్లూ ఉన్నాయి. ఒకవైపు మేజర్ కొయ్యబల్లమీద ఏదో వంతెనకు స్కెచ్ తయారు చేస్తున్నాడు. కెప్టెన్ విలియం పూర్తిగా మిలిటరీ యూనిఫారంలో ఆయనవద్ద నిలబడి ఉన్నాడు.]

విలియమ్ : ఈ స్కెచ్ ఏ వంతెనదండీ ?

మేజర్ : (స్కెచ్ తయారుచేస్తూ తల ఎత్తకుండానే) బొగ్గుగనివద్ద నున్న రైలు వంతెన తిరిగి పునర్నిర్మించాలి.

విలియమ్ : మేజర్ ! (ఆగి) మీతో ఒక విషయం చెప్పాలనుంది.

మేజర్ : ఊ ! ఊ !

విలియమ్ : కెప్టెన్ ఫ్రిట్జికి యివ్వాళ బొగ్గుగని వద్ద డ్యూటీ. ఆయన మిలిటరీ టోపీ ధరించకుండా మామూలు టోపీతో వెళ్ళాడు డ్యూటీకి.

మేజర్ : ఏం జరిగిందేమిటి ?

విలియమ్ : మనం ఉన్నది శత్రువుల భూమిలో. మనమెంతో మెలకువగా ఉండాలి. మిలిటరీ నియమావళి రెండవసూత్ర ప్రకారం........

మేజర్ : కెప్టెన్ విలియమ్ ! నీ మనస్సులో అకారణమైన శంకలు పుట్టుకొస్తున్నాయ్. నాకు మాత్రం యిక్కడి ప్రజలు అమాయకులూ, శాంతిప్రియులూ అనిపిస్తోంది.

విలియం : ఏమైనప్పటికీ మిలిటరీ నియమావళి ప్రకారం....

మేజర్ : (సంబోధిస్తూ) లెఫ్టినెంట్ రౌశర్ !

*(ఒక అరలోనుండి లెఫ్టినెంట్ రౌశర్ తక్షణం తొంగిచూస్తాడు. ముఖానికి నవ్వు పట్టించుకొన్నాడు. పరదా తొలగించి మేజర్ వద్దకు వచ్చినిలబడుతాడు.)*

రౌశర్ : వచ్చాను సార్ !

విలియం : లెఫ్టినెంట్ రౌశర్ !

రౌశర్ : యస్ కెప్టెన్ !

విలియం : నీ ముఖంమీద ఆ నల్పునురుగు చూచుకున్నావా ?

రౌశర్ : నేను గడ్డం చేసుకుంటున్నాను సార్.

విలియం : (*గద్దిస్తూ*) కోటు గుండీలుకూడా తెరిచే ఉంచావు.

రౌశర్ : చిత్తం సార్ !.........నిద్ర పోతోతున్నాను సార్ !

విలియం : ముందు కోటు గుండీలు పెట్టుకో. పై ఆఫీసర్లముందు యిదేనా వేషం ? మిలిటరీ నియమావళి ఏదవసూత్రం చదవలా ?

రౌశర్ : (*కోటుగుండీలు పెట్టుకుంటూ*) చిత్తం కెప్టెన్ ! క్షమించండి !

కర్నల్‌షాఫ్ట్ : (*ప్రవేశిస్తూ*) ఏమిటి విశేషాలు మేజర్ !
(*అందరూ లేచి నిలబడతారు.*) హలో కెప్టెన్ విలియం ! (*నవ్వుతూ*) మిలిటరీ నియమావళిమీ దేదో లెక్చరిస్తున్నావ్ !

మేజర్ : (*అలసిన గొంతుతో*) ఈ కెప్టెన్ విలియంగారు పాపం ! రౌశర్‌మీద మండిపడుతున్నారు.

కర్నల్ షాఫ్ట్ : కెప్టెన్ విలియం !

విలియం : యస్ కర్నల్ !

కర్నల్ : ప్రిట్జ్ నేటి ఉదయం నుండీ బొగ్గుగనివద్ద డ్యూటీలో ఉన్నాడు. ఆయన ఆరోగ్యం సరిగాలేదు. నీవు ఆయన డ్యూటీకి వెళ్లు.

విలియమ్ : చిత్తం కర్నల్ ! (*విలియం వెళ్ళిపోతాడు*)

కర్నల్ : (*కూర్చుంటూ*) ఈ కుర్రవాడు ముందెప్పుడో కేంద్ర కార్యాలయానికి ప్రమోటవుతాడు.

మేజర్ : అదెలా సంభవం ?

కర్నల్ : ఇతనికి కంఠస్థమైనన్ని మిలిటరీ నియమాలు బహాబహా సైన్యాధిపతులకు కూడా గుర్తుండవు. పైగా పట్టిమూర్ఖుడు కూడాను.

మేజర్ : పట్టిగాడిద ! అందుకే మరి........

కర్నల్ : మేజర్ ! ఈ స్కెచ్ దేనిదో ?

మేజర్ : రైలువంతెనది.

కర్నల్ : అహా! ఉహూ!

మేజర్ : కర్నల్ ! ఈ యుద్ధం ఎప్పుడు ముగుస్తుంది ?

కర్నల్ : మన శత్రువులు నాశనమైన రోజున.

మేజర్ : మనమిప్పుడు యూరప్ ఖండం మొత్తాన్ని జయించాం. యిక మనలను కాదనగలవా శ్శెవరున్నారూ ?

కర్నల్ : యింకా ఉన్నారు శత్రువులు.

రౌశర్ : ఐతే యుద్ధం ఈ ఏడు ముగిసి పోదా ?

కర్నల్ : ఏం రౌశర్ ? అసలు సంగతేమిటీ ?

రౌశర్ : ఏంలేదు సార్ ! యుద్ధంగనక ఈ ఏడు ముగిస్తే నేనూ, ఐటల్ యిక్కడే ఉండిపోదామని ఆలోచిస్తున్నాం. ఈ ప్రాంతం చాలా హాయిగా ఉందని పిస్తోంది. ఈ లోయలో మేమొక అందమైన ప్రదేశం చూశాం. అక్కడ వ్యవసాయం పెట్టి ప్రశాంతంగా ఉందామని మా కోరిక.

కర్నల్ : యింటివద్ద పొలమేమైంది ?

రౌశర్ : అదెంత ! చారెడు పొలం. అప్పు తీర్చటానికి అమ్ముడై పోయింది.

కర్నల్ : ఉహూ!

రౌశర్ : ఐతే కర్నల్ ! నేనూ ఐటల్ గలిసి క్రిస్మస్‌లో సెలవు దొరికితే....

కర్నల్ : అసలు క్రిస్మస్ రానీ ! యింకా బోలెడన్ని పనులు చెయ్యాలి.

*(ఒక యువక ఆఫీసర్ ప్రవేశిస్తాడు.)*

కర్నల్ : ఐటల్ ! ఏమిటి విశేషం ?

ఐటల్ : (సెల్యూట్ చేస్తూ) మిస్టర్ బొరల్ తమను కలుసుకుంటారట సార్ !

కర్నల్ : వారిని లోపలికి పంపించు !

*(ఐటల్ వెళ్ళిపోతాడు. బొరల్ లోపలికి వస్తాడు. అతని తలకొక కట్టున్నది.)*

కర్నల్ : ఏమిటి విశేషాలు బొరల్ ? మీతలకా కట్టేమిటీ ?

బొరల్ : నేను బొగ్గుగని దగ్గరగా వస్తున్నాను. ఇంతలో కొండపైనుండి ఒకచిన్న రాయి దివ్వునవచ్చి తగిలిం దకస్మాత్తుగా.

కర్నల్ : ఇది అకస్మాత్తుగా జరిగిందనేనా మీనమ్మకం ?

బారల్ : విస్సందేహంగా ! నాకీ ప్రజలనుగురించి బాగా తెలుసు. నేవిక్కడ పొలం కొన్నాను. భవనాలు కట్టించాను. ఒక అందమైన పిల్లనాకు దాసీ. నావిశ్వాసం ఆమె నన్ను ప్రేమిస్తున్నదని కూడా.

కర్నల్ : (*గంభీరంగా*) నామాట విను బారల్ ! మీరీ నగరం వదలి వెళ్ళటం చాలా మంచిది. యిక్కడిజనాని కిక మీరంటే గిట్టదు. మీరు వాళ్ళను మోసగించా రనుకుంటున్నారు. వారి దృష్టిలో మీరొక దేశద్రోహి. మీరు మాకు సహాయం చేశారు. నేను నా రిపోర్టులో మిమ్మల్ని ప్రశంసిస్తూ వ్రాశాను. యిక మీరిక్కడ ఎక్కువ కాలం ఉండటం ప్రాణాపాయం అన్నసత్యాన్ని మరుగుపరచటం అసంభవం.

బారల్ : కాని మేయర్‌స్థానంలో తమరు నగర ప్రబంధకునిగా నన్ను నియమించ మని కోరటానికి వచ్చాను.

కర్నల్ : దేశద్రోహితో ప్రజ లెలా సహకరిస్తారు చెప్పండి.

బారల్ : ఏమంటున్నారు తమరు ? యివి నాయకు డనతగిన మాటలు కావు.

కర్నల్ : మిస్టర్ బారల్ ! నేను మీకు మంచి సలహా యిస్తున్నాను. మీరిక్కడి నుండివెళ్ళిపొండి. నేనందు కిప్పుడే ఏర్పాట్లు చేస్తాను. యిదిగో నామాట వినండి. సాధ్యమైనంత వరకు యిల్లు కదలకండి. మిలిటరీ టోపీ ధరించండి. ఏ ఆడదాన్నీ నమ్మకండి.

బారల్ : నేను మేయర్‌కావా లనుకుంటున్నాను.

కర్నల్ : మిమ్మల్ని మేయర్‌గా చేయలేను. మీకీ నగరంలో పలుకుబడీ, ప్రతిష్ఠా శూన్యం. యిప్పు డున్నవారే మేయరుగా ఉంటారు. నేనాయన్ను కఠినంగా చూస్తున్నప్పటికీ ఆయనిక్కడి సామాన్య ప్రజల ప్రతినిధి. ఆయన హావ భావాలనుబట్టి ఈ దేశప్రజల ఆలోచన లేమిటో, వాళ్ళేం చేస్తున్నారో, ఏ కార్యానికి తయారౌతున్నారో నేను వెంటనే గ్రహించగలను. మేయర్ జాతికీ, దేశానికీ ప్రతిబింబం. నేను ఆయనకు దగ్గరగా ఉండాలనుకుంటు న్నాను, అందువల్ల రాబోయే ప్రమాదాలను గ్రహించి ముందుగానే తగిన జాగ్రతలు తీసుకోటానికి నాకు వీలు గలుగుతుంది.

బారల్ : నేను మేయర్ కావాలనుంది. నే నిక్కడి నుండి వెళ్ళదలచ లేదు. నే నిక్కడ పనిచేసయున్నాను. నాకు దానికి తగిన ప్రతిఫలం ముట్టాల్సింది

నేనీ విషయంలో హెడ్ క్వార్టర్సుకు జాబుకూడా వ్రాశాను. వారి జవాబు కోసం నిరీక్షిస్తున్నాను.

కర్నల్ : మీమనసుకు వచ్చినట్లు చెయ్యండి. కాని మీప్రాణాలు ఆపదలో ఉన్నా యని మాత్రం హెచ్చరిస్తున్నాను. ప్రజలు మిమ్మల్ని అసహ్యించుకుంటు న్నారు. ఈ దేశం మాదికాదు. మేము దీన్ని స్వాధీనం చేసుకున్నాం. ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకోండి : ప్రజలు దేశ ద్రోహిని చూచి భయపడతారు గాని అతనిని ప్రేమించరు.

బారల్ : కాని మనం వాళ్ళను ఓడించాం.

కర్నల్ : పరాజయం అనేది ఒక అస్థిర పదార్థం. అది ఎక్కువకాలం మనగల వస్తువుకాదు. గత మహాయుద్ధంలో మేము ఓడిపోయినాం. కాని తిరిగీనాడు మేము ఉన్నతి మార్గాన, విజయ పథాన సాగిపోతున్నాం. పరాజయానికి గ్యారంటీ ఎక్కడుందీ ? ప్రజలు నాలుగు గోడలమధ్య అజ్ఞాతంగా బహుశా ఏదో క్రొత్త తిరుగుబాటుకు సన్నాహాలు చేస్తున్నారని తెలుసా మీకు ?

బారల్ : తమకు తిరుగుబాటంటే భయంగా ఉందా కర్నల్ ?

కర్నల్ : (*అలసినస్వరంతో*) యుద్ధానుభవం లేకుండానే యుద్ధ నిపుణులుగా తయారైన వారంటేనే నాకు భయం. నాకిప్పటికీ జ్ఞాపకముంది. గత మహా యుద్ధంలో ఒక వృద్ధ బెల్జియం స్త్రీతో నాకు పరిచయం కలిగింది. (*స్వాప్న మయ స్వరంతో*) అమాయకమైన విచారం నిండినవదనం, శ్వేతహస్తాలు- నీలి ఏలినరాలు తేలిన చిన్నచిన్న సుకుమార హస్తాలు ! ఆమె తరుచుగా మా కేంపుకు వస్తుండేది. తన సుందర, సుకోమల కంపిత స్వరంతో మాకు మా జాతీయగీతం శ్రావ్యంగా పాడి వినిపించేది. ఆమె మాకెన్నో పనులు చేసి పెట్టేది. సిగరెట్లుగానీ, స్త్రీలుగానీ - ఆమె మా ప్రతిఅవసరాన్నీ తీరుస్తుండేది. (*ఆగి*) మేము ఉరితీసినది ఆమె ఏకైక పుత్రుణ్ణేననీ, ఆమే ఈ వృద్ధ స్త్రీ అనీ మాకే మాత్రం తెలియదు. చివరకు మేమా వృద్ధ స్త్రీని తుపాకికి గురిచేసేనాటికి ఆమె మా తాలూకు పన్నెండుమంది ఆఫీసర్లను హత్య చేసింది. దేంతోనో తెలుసా ? పిస్తోలుతోగానీ, మరతుపాకితోగానీ కాదు. ఒక్క ఉక్కు సూదితో ! నిత్యం తన టోపీలో దాచుకున్న ఒక్క మామూలు ఉక్కు సూదితో ! తెలుసా ? ఆ సూది యిప్పటికీ నావద్ద ఉంది. దానికొక ముత్యపు గుండీ అమర్చి ఉంది. ఆ గుండీ మీద ఒకబాతు చిత్రంకూడా చెక్కబడుంది.

బారల్ : ఐతే తమ రాజీనామా కాల్చేశారా ?

కర్నల్ : ఔను.

బారల్ : ఐతే ఈ కుట్రలు అంతటితో అంతమై యుండొచ్చు. యిక ఆఫీసర్లమీద మళ్ళీ ఎవరూ దెబ్బ తీసుండరు.

కర్నల్ : ఆ వృద్ధస్త్రీని కాల్చివేసినా అగ్ని చల్లారలేదు. నలువైపులా అలుము కొన్నది. విజృంభించింది. హత్యలు, ఘర్షణలు, ప్రతీకారం యింకా చెల రేగాయి.

బారల్ : తమక్రింది అధికారుల ముందుకూడా యిలాగే మాట్లాడుతారా ?

కర్నల్ : వాళ్ళ కి మాటలు అర్థంకావు.

బారల్ : కర్నల్ ! యిటువంటి పనికి తమను నాయకుడిగా ఎన్నుకొని యుండ వలసిందికాదు.

కర్నల్ : కనీసం నేను మీవంటి మూర్ఖుణ్ణి కాను. నేను పరిస్థితులను లోతుగా పరిశీలిస్తాను. కాబట్టే తప్పులు కూడా తక్కువ చేస్తాను. మిస్టర్ బారల్ ! మీపనిక్కడ పూర్తయి పోయింది. నేను మీ విషయం రెకమెండ్ చేస్తాను. మీరు మీ పని తిరిగి ప్రారంభించటానికీ, నూతన విజయాలు పొందటానికీ వీలున్న మరో నగరానికి పంపేట్లు చూస్తాను.

(కెప్టెన్ విలియం త్వరత్వరగా ప్రవేశిస్తాడు.)

కర్నల్ : ఏమిటి విలియం ! హడావిడిగా వచ్చావ్ ?

విలియం : సార్ ! కెప్టెన్ ఫ్రిట్జ్‌ని హారెత్ అను ఫ్రెంచికూలీ బాకుతో పొడిచి హత్య చేశాడు సార్ ! వాడసలు దెబ్బతీయాలనుకున్నది నామీద. కాని కెప్టెన్ ఫ్రిట్జ్ నన్ను రక్షించుదామని ముందుకొచ్చి నిలబడ్డాడు.

కర్నల్ : (మెల్లగా) హూఁ.... ఈముప్పు మళ్ళీ వచ్చిపడ్డది.

విలియం : తమ ఆజ్ఞేమిటి సార్ ?

కర్నల్ : ఏమీలేదు. (ఆగి) మేయరుగారికి మా నమస్కారాలని చెప్పి కర్నల్ గారిప్పుడే కలుసుకుంటారన్నారని చెప్పు.

విలియం : యస్‌సార్ !

*(విలియం త్వరగా బయటికి వెళ్ళిపోతాడు. కర్నల్ తలపట్టుకొని కూర్చుండిపోతాడు.)*

కవిత :

# శిల్ప సందేశము

— శ్రీ మల్లికార్జున్

ఊహ వెన్వెంట స్వర్గమ్ము లుద్గమించు
నేర్పుగల ఉలిముక్కుచే నిర్మితమయి
శైల శిఖరాల గర్భాన శిథిల శిలల
తల్పముల బుట్టె నది శిల్ప కల్పితమయి.

రాలను ఉలి పాటలతో
లాలించిన శిల్పసృష్టి లాస్యములాడం
జాలిన స్వప్నోషస్సును
బోలిన శిల్పాల గాంచ బోయితి నటకున్.

భావకవుల ఊహలవలె
జీవన లాస్యముల నందు చిత్రించుచు పు
ష్పావరణము గావించెను
పూవులు శుష్కించనట్లు పోషణ జేసెన్.

కానలోని రాలు మైనపు ముద్దలై
మలచుకొన్న వేమొ వలపు లన్ని !
మించు మబ్బుల వినిపించు విపంచియై
భావ మాలపించు ప్రణయ రుతుల.

ఆటలాడి యలసినట్టి బాలికలు వి
శ్రాంతి గొన్నయట్టి భ్రాంతి దోప
రాతిగోడలందు రమణీయ రూపాల
రమణు లొరగినారు క్రమములోన.

అట్టి నిశ్శబ్దలోకమ్ము నరయుచుండ
నాకు విన్పించె శిథిల స్వన మ్మొకండు
శిల్ప హృదయాల వెడలెడు శిథిల రవము
వెన్నయి కరంగి పోతి నా వీటియందు.

ఒకచోట తలలు విరిగి, మ
రొకచోట కరాలు రాలి, ఒక్కెడ నవియే
వికట స్వరూపములతో
శకలములై నేల నొరగి శయనించె నహో!

గుండెలం దెన్ని కుంపట్లు గుబులుకొనెనో!
అగ్ని కీలలు నేత్రాల నాడసాగె;
రాలలో నెన్ని శోకాలు రగులుకొనెనో
క్రమ్ముకొన్నవి పొగలు శిల్పమ్ములందు.

రాతి గుండియలందు రవళించు వీణలో
విప్లవ స్వరములు విలయమెత్తె
ఘల్లు ఘల్లున మ్రోయు గజ్జెల మ్రోతలో
కాళ నర్తకి కాలు గదుపసాగె
మూగవోయిన శిల్పమూర్తిలో ఆవేద
నా నిశీథమ్ములు కానిపించె
కనుదోయిలో విల్చు కాంక్ష లన్నియు సెల
యేరులై ప్రవహించెనేమొ, నేను

స్తబ్ధుడ నయితి నాటి నిశ్శబ్దమందు,
స్వప్నమో లేక జాగ్రదవస్థ యేమొ
తెలియకుండెను, నాకొక విలయవేద
నమ్ము వినిపించె, కన్నుల నమ్మకుంటి.

మూగనోము నోచి మూలను విద్రించు
కోతిబొమ్మ యొకటి గొంతువిప్పె
గొంతునుండి వెడలె కోటి యావేదనల్
మనసువిప్పి యిట్లు మాటలాడె.

"శిలలలో స్వర్గాల మలచి సృష్టించిన
శిల్పుల స్వప్నాలు శిథిలమాయె
పగిలిన రాళ్ళలో ప్రాణమ్ము వోసిన
అమృతహస్త గుణమ్ము లంతరించె
రూపుమార్చిన వానరుల ఖేలనమ్ముల
బొమ్మలలోని నాట్యమ్ము ముగిసె
కిరణాలు చొరలేని చరితలో రోచిస్సు
నందించు జ్యోతి నే డారిపోయె

జీవలాస్యాలలోని శింజితము లాగె
మానవుని దర్పణమ్మింక కానరాదు
మనిషిలో మానవత్వము మాయునపుడు
ఈ కళాసీమ లేలనోయీ మనీషి!

దెందమ్ములో విషబిందువులే కాదు
మాటలలోపల మధువు లేదు
కౌగిలి మధ్యలో కత్తెరలే కాదు
కన్నీట మోసమ్ము కానరాదు
ఒరులకు హితుడుగా నుండకుండుటె కాదు
కరుణాబ్ధిలో గడ్డకట్టలేదు
అమృత సాగరమందు హాలాహలమె కాదు
అవనీతలమ్మున నగ్ని కాదు

రంగు బులిమిన పూలపై రక్తిలేని
రసిక హృదయుడు, కళ కమురస్తి దతడు
అణుసుమమ్ముల చేబూవి యర్చనమ్మ
సల్పగాలేని శాంతి పూజారి యతడు.

కనక కిరణాలు చొరలేని కాళరాత్రి
కోణములయందు నివసించు కోటి కష్ట
జీవ హృదయమ్ములన్ పరీక్షించితేని
కానిపించును పరిపూర్ణ మానవుండు.

వర్ణభేదములేని జీవన పథాల
బ్రతుకు చక్రాల ద్రిప్పిన బాధితుండు
సృష్టి సంఘర్షణమ్ములో చిక్కి వలగి
చితుకు కుసుమమ్ములంబోలు పతితు డతడు.

అవనీ కంఠము నొక్కుచున్ ప్రళయమే యాదేశ మీయంగ, మా
నవతాస్వాంతము నవ్య సభ్యతకు పన్నాగంబులో చిక్కియున్
చివికెన్ లేదిక మానవత్వమును నాసింపంగ లాభమ్ము, మా
నవుడా! కాదె 'అజాగళస్తనము' నీనామమ్ము నీ యుర్విలో.

గతము నిశామయంబను వికార ప్రలాపము లాడియున్ నవీ
నతకయి రూపుమార్చి భువనాలకు ముక్తి నొసంగు దివ్యమా
మతమిది యొక్కటే యనుచు మానవు లెందరొ యుద్యమించుచున్
మతముల సృష్టిజేయుచు దుమారము లేపిరి స్వార్థబుద్ధితో.

'క్రొత్త యొకవింత ప్రాతది రోత' గాగ
కాలచక్రము సాగె మతాలు నిటులె
తలకు నొక్కటి చొప్పున తలలనెత్తి
యారుచున్ రాలు పూవులై యంతరించె.

పుటియలలోన శాస్త్రములు పుట్టియు పుట్టకముందె కోరికల్
కొటకొట లాడిపోయినవి, కొబ్బెరకాయలు విశ్వపూజలో
నుటిమెను బొంబురూపమున, ఉచ్చుల బన్నెను వీద్దె, మోసమం
చెఱుగని వాడనై బ్రతుకు నీడ్చుదు నెట్టులొ గ్రుడ్డివాడనై.

మానవత్వము శూన్యమౌ మహిని నిట్లు
నిమిషమాత్రము నేనిక నిలువ ననుచు
కూలిపోయెను శిల్పమ్ము, రాలిపోయె
నాదు కన్నుల అశ్రుకణమ్ము లచట.

*[తెలంగాణా రచయితల సంఘం జరిపిన విద్యార్థుల కవితా రచన పోటీలో తృతీయ బహుమతి నందిన రచన.]*

*కథానిక :*

# స్వార్థత్యాగి

— "వల్లపురెడ్డి"

తన జీవితంలో తమ్ముడు, శేషిగాడు అడుగెట్టి నప్పట్నుంచీ అమ్మలో తన విషయమై క్రమంగా కలుగుతూ వచ్చిన మార్పుల్ని ఒకటొక్కటే జ్ఞప్తికి తెచ్చుకోసాగాడు గోపి. వాడికిప్పుడు పదేళ్ళు. తమ్ముడికి ఏడేళ్ళు.

శేషిగాడు పుట్టకముందు అమ్మ తనంటే హద్దులేని ప్రేమ చూపేది. తను ఉదయం నిద్రలేచే సరికే అమ్మ ఎదురుగా చేతులు చాచి తనకొఱకే నిరీక్షిస్తూ ఉండేది. పరిశుభ్రంగా స్నానం చేయించి మంచి దుస్తుల్తో ముస్తాబు చేసి పాలు, బిస్కట్లు ఆహారంగా ఇచ్చేది. ఇంటి పనుల్లో మునిగి ఉన్నాసరే తనను వేయి కళ్ళతో చూచేది. ఎప్పటి కప్పుడు, తినమని బలవంత పెట్టడం, కాస్సేపు కళ్ళముందు లేకపోయే సరికి "గోపీ, గోపీ...." అంటూ ఆత్రుతతో వెదకటం, రాత్రికి తన ఒళ్ళోనే పరుండ బెట్టు కోవటం....ఇవన్నీ తనకు మూడేళ్ళు నిండుతున్నప్పటి ఘట్టాలు. అవి అంత విపులంగా జ్ఞాపకం లేకపోయినా, స్మృతి పథంలో ఇంకా మసక మసకగా ఉన్నాయి.

కాని శేషిగాడు పుట్టిం తరువాత—పుట్టింరోజునుంచే—తనకు అన్నీకష్టమైవాయి. అమ్మ ఒళ్ళో పడుకోవడానికి సుతరామూ వీలులేకపోయింది. తన స్థానాన్ని తమ్ముడు లాక్కున్నాడు. తనకు జరగాల్సిన ముచ్చటలన్నీ వాడికే జరుగుతున్నాయి. ఏదో—వేళకు స్నానపానాలు తప్పితే అమ్మ తనపట్ల ఎక్కువ శ్రద్ధ కనపరచటమే లేదు. ఎప్పుడూ శేషిగాడితోనే. ఏదో ముచ్చట, ఏదో కబురు. వాడికి అసలు మాటలెరావు. సరిగా ఏడ్వనుకూడా లేదు. కాని వాడితో ఏవో గతాన్ని, భవిష్యత్తునూ, వర్తమానాన్ని గూర్చి ప్రపంచంలోని గాథలనన్నిటినీ ఏకరవు పెడుతుంది. తనకు మాటలన్నీ వచ్చు; కాని ఏం లాభం? అమ్మ మాట్లాడనే మాట్లాడదు. ఒకవేళ మాటలాడినా "ఛీ, పోరా వెధవా" అనే. ఎప్పుడేనా "అమ్మా ఫలానా తాయిలం పెట్టవే....ఫలానా బొమ్మ ఇయ్యవే" అని మారాం చేస్తే అడిగింది ఇవ్వదు సరికదా, కనీసం తన ఏడ్పునైనా వినిపించుకోదు. తమ్ముడు నిద్రలో ఉండి, అమ్మ మేలుకుని ఉంటే, ఆ సమయంలో తను వెళితే మాత్రం కొంచం చేరదీసి, ఒళ్ళో కూచోబెట్టుకుని నాలుగు మాటలు మాట్లాడి, రెండు ముద్దులిస్తుంది. అంతే.

ఇక నాన్నంటూ ఉన్నాడంటే ఆయనకు ఇంట్లో కాలే నిలువదు. భోజన వేళలప్పుడు మినహా ఇంటికి రానే రాడు. తనను, శేషిగాడిని పిలిచి ఇరువురితోనూ ఒక చిరునవ్వు, ఒక ముద్దు. అంతే ఆపైన తన పనిమీద వెళ్ళిపోతాడు. కొంత మట్టుకు నాన్నే మేలు. ఎవరిపట్లా పక్షపాతం లేదు. తమ్ముడు పుట్టినప్పటి నుంచీ తను నాన్న ప్రక్కనే పడుకుంటున్నాడు. తను నిద్ర పోయాక ఎప్పుడొచ్చి పడుకుంటాడో తెలీదు. నిద్ర మెలకువ వచ్చి చూస్తే తన ప్రక్కన నాన్న పడుకుని ఉంటాడు. మళ్ళీ ప్రొద్దున లేచి చూసే సరికి నాన్న మాయమై ఉంటాడు. అప్పటికే లేచి తన పనిమీద వెళ్లి ఉంటాడు. ఇవి తను ఐదారు సంవత్సరాల ఈడులో ఉన్నప్పటి సంగతులు.

ఈనాడు తనకు పదేళ్ళు. బళ్లో నాలుగో తరగతి చదువుతున్నాడు. తమ్ముడికేడేళ్ళు. వాడూ చదువుతున్నాడు రెండో తరగతి. అమ్మకు ఇప్పటికీ తనపట్ల పూర్వభావమే ఉంది. ఇద్దరితోనూ చనువుగా మాట్లాడుతుంది. ఇద్దరికి ఒకేసారి అన్నం పెడుతుంది. కాని తను తినకపోయినా లక్ష్యం చెయ్యదు. తమ్ముడు తినకపోతే మాత్రం బ్రతిమిలాడి తినిపిస్తుంది. బళ్ళో మిత్రులతో సమయం చాలా మట్టుకు గడిచి పోతూందిప్పుడు. అందుకే అమ్మ తన్ను ఖాతరు చేసినా, చేయకపోయినా అంతగా పట్టించుకోవటం లేదు. అయినా ఫరవా లేదు. అమ్మ మంచిదే.

అదృష్టం బావుండి ఇంకో తమ్ముడు పుట్టలేదు. కాని పుట్టి ఉంటే తనగతి ఇంకా ఎలా పరిణమించేదో. అమ్మ తనపట్ల చూపుతున్న అశ్రద్ధను కొన్నేళ్ళనుంచీ ఓర్చుకుంటున్నాడు కనుక ఇప్పుడు ఆ విషయంలో అంతగా ఫీలు కావటం లేదు. అయినా, అప్పుడప్పుడు అమ్మ ప్రవర్తన తనకెక్కడలేని కోపం పుట్టిస్తూంది. వాడు ఎన్ని తప్పులు చేసినా ఏమీ అనదు. కాని తను ఏచిన్న తప్పుచేసినా కసరుతుంది. కొడ్తుందికూడ అడపాదడపా. తినుబండారాలేమైనా పెడితే వాడికే ఎక్కువ. "ఎందుకే తమ్ముడి కెక్కువ పెడతావ్ ?" అనడిగితే "వాడు చిన్నవాడు కదూ !" అనే సమాధానం. ఈ సమాధానం తనకేమీ నచ్చలేదు. చిన్నవాడైతే తక్కువ పెట్టాలి గాని ఎక్కువ పెట్టడం దేనికి ? తన కంటే వాడు తక్కువ తినాలి. మరి అమ్మ దృష్టిలో ఈ న్యాయమేమిటో ? బట్టలు కుట్టించినాఇదే వరస. తమ్ముడికి వాడు కోరిన బట్టలతో చొక్కాలు, నిక్కర్లు కుట్టిస్తారు. కాని తనకు మాత్రం వాళ్లిష్ట మొచ్చినవే. "ఎందుకే ఇట్లా ?" అనడిగితే "నువ్వు పెద్దవాడివి" అనే జవాబు. తను పెద్దవాడైతే ?....తనకు హృదయం లేదా ? తనకు మాత్రం కోరికలు లేవూ ? ఏమో ! అమ్మ ప్రవర్తన అంత వింతగాతోస్తూంది.

ఇవన్నీ ఏడేళ్ళుగా తను ఓర్చుకుంటూ వస్తున్న సర్వసాధారణ విషయాలె. కాని ఈరోజు జరిగిన ఘటన ఒక్కటే తన మనస్సుని వికలం చేస్తూంది. అమ్మ మీద, ముఖ్యంగా తమ్ముని మీద ఏదోవిధమైన ద్వేషమూ ఆద్వేషంలో ప్రతీకారం చేయాలనే తీవ్రవాంఛనూ రేపుతూంది.

సాయంత్రం బడి వదలగానే పిల్లలంతా కలిసి చెడుగుడు ఆడుతున్నారు. తనకు సరి ఉజ్జీ ఎవడూ లేకపోవటం వల్ల పిల్లల ఆటను చూస్తూ ఇరుపక్షాలకు తీర్పు చెప్పటానికి నియమింప బడ్డాడు గోపి. ఆటలో తమ్ము డొకవైపునుంచి ఆడుతున్నాడు. వాడికి ఎదుటిపక్షం వాళ్ళు ఒక ఆట గెలిచారు, రెండోదికూడా వాళ్ళే తీసుకున్నారు. ఇక మూడో ఆట. ఇదే ఆఖరు ఆట. ఈ ఆటకు శేషు కొంచం పట్టుదల కొచ్చాడు. ఎలాగైనా గెలుపు తీసికొనే వెళ్లాలనుకున్నాడు.

ఇరుపక్షాలలో ఉన్న వాళ్ళందరూ మ్రగ్గి, రంగం నుంచి నిష్క్రమించారు. శేషు మిగిలాడు. ఎదుటి పక్షంలో కూడా ఒక్కడే చిక్కాడు. ఈసారి పరిస్థితి గెలుపు ఓటముల మధ్య జటిలంగా చిక్కుపడింది. శేషు ఎన్నిసార్లు వెళ్ళినా ఎదుటి వాణ్ణి ముట్టి రాలేకపోయాడు. ఎదుటివాడు వస్తే పట్టలేకపోయాడు. ఆఖరికి శేషు వెళ్ళాడు కూత పెడుతూ, తప్పకుండా ఎదుటివాణ్ణి ముట్టి, తప్పించుకుని వచ్చేపెయ్యాలనే దృఢ సంకల్పంతో. ప్రతిపక్షి కూడా తక్కువ వాడేమీ కాదు. శేషు

కూతతో వాడిని ముట్టి తప్పించుకు పోజూచాడు. కాని సాధ్య పడలేదు. ప్రతిపక్షి బలంకొద్దీ శేషును అంకించుకుని ఒకపట్టున వదిలాడు కాదు. శేషు భూమ్మీద పడి బలంకొద్ది దొర్లుతూ మధ్యనున్న గీతను తాకాడు. కాని గీతను తాకే ఒక క్షణం క్రితమే కూత ఆగిపోయింది. ఇరుపక్షాల వారూ "గెలుపు మాదంటే మాది" అన్నారు. శేషుకు తెలుసు తను గీతను ముట్టకముందే కూత ఆగిపోయిందన్న విషయం. కాని గెలుపు తమదనిపించుకుని పోవాలనే సంకల్పంకొద్దీ ఏమీ అన లేదు. తీర్పు గోపి చెప్పాలి. శేషు అదో మాదిరిగా చూచాడు అన్న ముఖంలోకి. తీర్పు తనపక్షం చెబుతాడనే ఆశతో చూడసాగాడు. కాని తీరా తీర్పు వినేసరికి వాడి ఆశమీద వజ్రపాతం జరిగింది. ఎదుటివాళ్ల సంతోష ధ్వనులు గావిస్తూ వెళ్ళి పోయారు. వాళ్ళ హర్షధ్వానాలు శేషు హృదయంలో శూలాల్లా గ్రుచ్చుకున్నాయి. గాయపడిన ఆశతో ఇంటికి వచ్చాడు. అన్నతో మాట్లాడలేదు. రాత్రికి భోజనం ముందు కూర్చుని, తినకుండా కళ్ళలో నీళ్లు నింపుకున్నాడు.

"ఎందుకు నాయనా భోజనం చెయ్యవు శేషూ ?" అనడిగింది అమ్మ.

తన సంకల్పం భగ్నమై, కలిగిన అవమానం....తజ్జనితక్లేశం ఇంతదాకా కన్నీళ్ళు నింపు కోవటంతో సరిపుచ్చాడు. కాని అమ్మ బుజ్జగిస్తూ తను భోంచెయ్యక పోవటానికి కారణ మడిగేసరికి బిగ్గరగా ఏడ్వటొచ్చాడు. గోపికిదంతా ఏమీ అర్థం కాలేదు. అమ్మ ఎంతో ప్రయత్నంమీద అడిగిం తరువాత వాడి ఏడ్పుకు అసలు కారకుడు తనేనని తేలింది గోపికి. కాని తనదేమీ నేరం లేదు. తీర్పు ఉన్నదున్న ట్లుగా చెప్పాడు. అమ్మ తన మీదికి దౌడుతీసింది : "ఓరి, పోకిరి వెధవా. తమ్ముడు ఏడుస్తుంటే ప్రక్కనే కూర్చుని మెక్కుతూ, ఏమీ ఎఱుగనట్లున్నావా ? నీకీ మధ్య తిండి మబ్బు ఎక్కువయింది నిలు" అంటూ. శేషు అన్నయ్య తీర్పు తన పక్షాన చెప్పలేదనే ఫిర్యాదు చేశాడు; కాని ఓటమికి కారణం తన అసమర్థతేనని చెప్పలేదు. అన్నయ్య తీర్పు న్యాయమైందే అయినప్పటికీ శేషుకు తీర్పు తన పక్షం రానం దుకు గోపిమీద ఏదో అకారణ క్రోధం జనించింది. కలిగిన కోపాన్ని తను స్వయంగా సాధించలేక అమ్మతో ఫిర్యాదు చేశాడు.

అమ్మ గోపిని మాటలతోనే విడువలేదు ; వెంటనే "ఛెళ్ళు ఛెళ్ళు మంటూ వాయించింది రెండు చెంపల్ని. చెంపలు కందిపోయాయి. కళ్ళలో నీళ్ళు నిండు కున్నాయి. ఉబికి వస్తూన్న ఏడ్పును బిగబట్టుకుని మహా కష్టంగా "నేనేం చేశా నమ్మా. ఉన్న తీర్పు చెప్పాను." అనగలిగాడు. "ఏంరా శేషూ ?" అని తమ్ముని దిక్కు చూశాడు. తమ్ముడు జవాబివ్వకనే తల వంచుకుని మౌనంగా కూచున్నాడు.

"వాణ్ణే మడుగుతావు ? మహా న్యాయశీలివి, దిక్కుమాలిన వెధవా?" అంటూ మరో రెండు దెబ్బలు మోదింది వీపుమీద. దాంతో గోపి "అమ్మో !" అని బిగ్గరగా ఏడ్వ ప్రారంభించే సరికి "జాగ్రత్త నోట్లోంచి ధ్వని బయటి కొచ్చిందంటే!" అని గర్జించింది అమ్మ. ధ్వని లోలోపలే అణగింది.

ముందు పెట్టుకున్న అన్నం తినకుండా మధ్యలోనే విడిచి లేవబోతూంటే మళ్ళీ కోప్పడింది. "అన్నం విడిచిపెట్టు; తరువాత నీ ఆట చెప్తా" అని. ఇష్టం లేకపోయినా పూర్తి అన్నం తిని లేచాడు. శేషు వెళ్ళి అమ్మ పక్కమీద పడుకున్నాడు. తను ఊరికే కూర్చున్నాడు నాన్న మంచం దగ్గిర.

నాన్న వచ్చి పలుకరించాడు గోపిని. గోపి పలుక లేదు. శేషు అంతవరకే నిద్రలో పడ్డాడు. నాన్న, ప్రక్కన కూర్చుని గోపిని చేరదీయ ప్రయత్నించాడు. గోపీ అలకతో దూరంగా జరిగాడు. "ఎందుకు అబ్బాయి కోపంగా ఉన్నాడు?" అనడిగాడు అమ్మను, అక్కడినుంచి లేచి లోపలికి వెడుతూ.

"నాలుగు పడ్డాయి" అంది అమ్మ.

"ఎందు కేమిటి?" అని ప్రశ్నించాడు నాన్న.

"ఆటలో శేషిగాడికి వ్యతిరేకంగా తీర్పు చెప్పి వాడినేడ్పించాడండి."

"అయితే నువు వీడి నేడ్పించావన్నమాట. బాగుంది వరుస. నీకేమీ పవి పాటు లేనట్లుంది. పిల్లల్ని కొట్టటాని కెట్లా చేతులాడుతాయి? ఛీ." అంటూ తిరిగి గోపి దగ్గరికొచ్చాడు. "రా బాబూ పడుకో. ఈసారి మీ అమ్మ నీ మీద చేయి చేసుకుంటే నేనున్నానులే" అంటూ హామీ ఇచ్చాడు.

గోపి మంచం మీద పడుకున్నాడు. కాని నిద్రపోలా. ఏమో ఆలోచిస్తూ ఉన్నాడు. నాన్న భోజనం చెయ్యటానికి ఇంట్లోకి లేచి వెళ్ళాడు.

ఇంట్లో నాన్నకు అన్నం వడ్డించి అమ్మ గోపి పడుకున్న మంచం దగ్గరి కొచ్చి కూచుంది. "బాబూ, గోపీ !" అని పిలిచింది చేత్తో శరీరాన్ని స్పృశిస్తూ.

గోపి మెలకువతో ఉన్నప్పటికీ పలుకలేదు.

గోపి నిద్రలో ఉన్నాడనుకుంది అమ్మ. చెంపలు, వీపు అన్నిటినీ నిమిరి చూసింది. "నాతండ్రీ" అంటూ నిట్టూర్చింది. కళ్ళల్లోంచి రెండు కన్నీటి చుక్కలు వాడి చెక్కుల మీద రాలి పడినయి.

గోపి గుర్తించాడు అమ్మ తను చేసిందానికి పశ్చాత్తాప పడుతూ ఉందని. కాని తనమనస్సులో రేగుతున్న తుఫానును మాత్రం అణచుకోలేక పోయాడు. 'ఇప్పుడు పశ్చాత్తాప పడితే ఏం లాభం ?' అనుకున్నాడు.

ఇంట్లోంచి నాన్నపిలువగానే లేచిపోయిందమ్మ. కొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ. గోపీ ఆలోచనలో పడ్డాడు. మనస్సులో తమ్ముని మీద క్రోధం, అసూయ పరుగెత్తుతున్నయి. వాడి కళ్ళముందు తమ్ముడు పుట్టకముందు నుంచీ ఇంతవరకు జరిగిన తన గత జీవితమంతా ఒక చలన చిత్రంగా సాగింది. తను హాయిగా కాలం గడిపేందుకు వీలు లేకండా వీడొకడు దాపురించాడు. నాసౌఖ్యాల్ని దోచుకున్నాడు. వీడు లేకపోతే....ఎంత బావుండును? ఇవే ఆలోచనలు. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు.

* * *

మరుదినం ఉదయంలేచి ముఖం కడుక్కునేసరికి ఏడుగంట లయింది గోపికి. ఎండలు ప్రారంభమైనందువల్ల ఎనిమిది గంటలకే బడి. ఏడున్నరకు ఇంటినుంచి బయలుదేరటం పరిపాటి. అంత పెందరాళే నీళ్ళు కాచి వాళ్ళకు స్నానం చేయించటం కొంచం శ్రమతో కూడుకున్న పని కనుక అమ్మ పిల్లలకు స్నానం చేయించే సమయాన్ని మధ్యాహ్ననికి మార్చింది. అమ్మా నాన్నల ఆజ్ఞప్రకారం అన్నాదమ్ములిరువురూ రోజూ జంటగా బడికి వెళ్ళాలి, జంటగా కలిసి రావాలి.

అల్పాహారం చేసి గోపీ, శేషూ బయల్దేరారు బడికి. మధ్యే మార్గంలో ఒండొరులతో మాట్లాడుకోలేదు. గత దినం జరిగిన ఘటన ఇంకా వాళ్ళ మస్తిష్కాల్లోంచి పూర్తిగా తొలగి పోలేదు. శేషుకు అన్నతో మాట్లాడుదామనిపించింది. కాని మాట్లాడలేక పోయాడు. శేషు మాట్లాడినా ప్రత్యుత్తర మిచ్చే పరిస్థితిలో లేడు గోపి. వాడు రాత్రంతా ఆలోచించి ఏదో నిర్ణయానికి వచ్చాడు.

బడికి ప్రక్కనే ఒక బావి ఉంది. గోపి బాగా ఈత నేర్చుకున్నాడు. తన ఈడు పిల్లలలోకల్లా గజఈతకా డనిపించుకున్నాడు. పదకొండు గంటలకు బడి వదలటంతోనే గోపి మిగతా పిల్లల్తో కూడి ఆ బావిలో ఈతకొట్టి ఇంటికి వస్తాడు. మొదటమొదట తలిదండ్రులు అభ్యంతర పెట్టారు, కాని వాడు మానలేదు. అమ్మకు ఒకరికి స్నానం చేయించే పని తక్కువయింది.

ఈత వచ్చిన పిల్లలంతా కేరుతూ జలక్రీడలాడుతూంటే మిగతా కొందరు మోట కలుజు మీద కూర్చుని తిలకిస్తూంటారు. శేషు ఒక బండమీద కూర్చుంటాడు రోజూ; అన్నతో కలిసి వెళ్ళాలి కనుక. శేషు అనుదినమూ అదే రాతిమీద కూర్చోటానికి ఒక కారణముంది. అది క్రింద సరియైన ఆధారం లేకపోవటంవల్ల బెణుకుతుంది. శేషు దానిమీద కూర్చుని దాన్ని వెనక్కి, ముందుకీ ఊగిస్తూ విలాసంగా అన్న, మిగతా పిల్లలు ఆడుతుంటే చూస్తుంటాడు.

ఈ సంగతి గోపికి క్షుణ్ణంగా తెలుసు. శేషు పరధ్యానంలో ఉన్న సమయం చూసి ఆరాతిపై—శేషుకి వెనకభాగం మీద—త్రొక్కిపట్టి తక్షణం వదిలితే సరి, శేషు ఎగిరి నీళ్ళలో పడతాడు. పిల్లలతో కలిసి ముట్టుకునే ఆట ఆడుకునేప్పుడు దొంగనుండి పారిపోయేప్పుడు అందరూ ఆరాతికి చేరువలో ఉన్న దారి గుండావే పోతారు. ఈరోజు పోతూపోతూ తను ఆబండమీద కాలువేసి శేషును నీళ్ళలోకి గెంతించి వాణ్ణి తనదారినుంచి తొలగించుకోవా లనుకున్నాడు.

శేషు అన్నతో కలిసి వెళ్ళాలి; కనుక గోపి మాట్లాడక పోయినా కలిసి పోవచ్చును గదా అని వాళ్ళంతా ఈత్తుంటే చూస్తూ కూచున్నాడు ఆ చోటనే.

గోపి అనుకున్నంత పనీ చేశాడు. రాత్రంతా తను నిర్ణయించుకున్నదదే. శేషు నీళ్ళలో పడ్డాడు భయంతో కేకవేస్తూ. వాడి వెనక నుంచి పరుగెడుతున్న వాళ్ళలో ఎవరివల్ల తను బావిలో పడ్డాడో తెలీదు. వాడు బావిలో పడటంచూసి అందరూ హాహాకారం చేస్తున్నారే కాని ఎవరూ వాడిని రక్షించటానికి పూనుకోవటం లేదు. ఆటాడుతూ అందరూ నిలిచిపోయారు. శేషు నీళ్ళలో మునకలు వేస్తున్నాడు. గోపి తమ్ముణ్ణి చూడసాగాడు. వాని మనస్సులో మళ్ళీ ఆలోచనలు రేగినయి.

శేషు పుట్టినప్పట్నుంచీ అమ్మ తనపట్ల పూర్వపు ప్రేమ తగ్గించింది నిజమే. తను ఆనాటినుంచీ ఇప్పటి వరకూ ఆ మార్పును అనుభవిస్తూనే ఉన్నాడు. అమ్మ ప్రేమ తనపట్ల సన్నగిలినా, ఈనాడు తననది అంతగా బాధ పెట్టడం లేదు. నిజానికి అమ్మకు తనపట్ల ప్రేమ తగ్గిందనుకోవటానికి నిదర్శన మేమిటి? పాపం! రాత్రి తనపైని ఉక్రోషంకొద్దీ మొదట నాల్గు దెబ్బలు కొట్టింది. అంతేగాని తరువాత పక్క దగ్గరికొచ్చి ఎంత ఆప్యాయంగా పలుకరించింది! ఎంత మృదువుగా ఒళ్లు నిమిరి చూసింది! ఎందుకు కొట్టానా అనే పశ్చాత్తాపంతో విడిచిన వేడి నిట్టూర్పు తనూ స్పర్శించాడు. ఆమె ఒళ్లు నిమిరియుండకపోతే ఈపాటికా దెబ్బలు నొప్పి చేసి ఉండేవి. అంతే కాకండా ఆమె కళ్ళలోంచి బాష్పాలు కూడా రాల్చింది. ఆమె స్పర్శ సంజీవిలా అయింది తనకొలుకు....ఎదుట బావిలో తమ్ముడు మరోమునక తీసుకుంటున్నాడు. తనవైపు దీనంగాచూస్తూ చేతులు చాచి 'అన్నా' అని పిలువబోయాడు. అంతలో నీళ్ళు నోట్లో దూరినయి. మరి పిలువలేక పోయాడు. తమ్ముణ్ణి రక్షించటానికి నీళ్ళలో దుముకుదామనుకున్నాడు. కాని మనస్సు కాళ్ళను కదలనివ్వలేదు. 'వీడు బ్రతికున్నంత వరకూ నీగతి ఇంతే' అంది. మళ్ళీ యోచించాడు.

ఈనాడు శేషు అంటే అమ్మకు అమితమయిన ప్రేమ. శేషు కన్పడకపోతే అమ్మ గుండెలు బాదుకోదూ: ఆమె శోకాన్ని తనెట్లా చూడగలుగుతాడు? రోజూ తనతో బడికి వస్తూపోతూ జంటగా ఉండే వారెవరు? తన కత్యంత ప్రియమయిన శేషు చనిపోతే అమ్మ తనను మాత్రం ప్రేమిస్తుందా? అన్నవు. ఈత నేర్చినవాడవు బావిదగ్గర ఉండీ రక్షించలేక పోయావని తన్నాదీ పోయదూ! శేషు 'అన్నా' అని పిలిచేసరికి తను ఏన్నో సుఖామ భూతుల్ని పొందేవాడు. అన్ని సౌఖ్యాలు ఒక్కమారుగా అనుభవిస్తున్నట్లుయి అమ్మ నుంచి ప్రేమ రూపకంగా తమ్ముడిని పొందాననుకుని తృప్తి పడేవాడు. అలాంటి తమ్ముడు పోతే మరి తనకు బాధ కాదూ! అమ్మ గుండె తెగి ముక్కలు ముక్కలయి పోదూ! అలా ముక్కలయిన గుండెను తీసుకుని తనేం చేయాలి? ఇంతహ రామలక్ష్మణుల గాథే మరచి పోయాడు. పంతులు ఎన్నిమార్లు చెప్పాడు. కథ ఎంత వినినా అన్నా దమ్ముల ప్రేమ మరువరానిది. తనే తమ్మునితో ఎన్నిమార్లు చెప్పాడని: లక్ష్మణుడు మూర్ఛ పోతే రాముడు కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చాడు. అది నిజమైన భ్రాతృ ప్రేమ. మరి ఇప్పుడు తను చేస్తున్న దేమిటి? ఒకవైపు తమ్ముడు మరణంతో కుస్తీపడు తుంటే మరొకవైపు తాను చూస్తూ నిలుచున్నాడు. అదికాక తనే తమ్ముణి మృత్యు ముఖంలోకి త్రోశాడే: భ్రాతృద్రోహం. ఛీ! బ్రతుకు కాల్చనా:.... తమ్ముడు మునక తీసుకుని నీటిమీదికి వచ్చాడు. మళ్లీ మునుగుతాడు. ఇక ఈసారి మునిగితే బయటికి రాడు. రెండడుగులు ముందుకు వేశాడు. ఉహుఁ! వెనక్కి వచ్చాడు. వీణ్ణి నీటిలోంచి తీసినా లాభం లేదు. వాడు తప్పుచేసినా, తను తప్పుచేసినా తిట్లూ దెబ్బలూ తనకే. వాడు ఉండటం వల్ల తనకు సుఖాలన్నీ దూరమే. మళ్ళీ ఊహించాడు.

తమ్ముడు చనిపోవటం వల్ల తను పొందేదేమి కన్పించటంలేదు. వాడి సౌఖ్యాలన్నీ తనకబ్బుతాయని నిర్ణయం లేదు. తనే చనిపోతే....? ఆఁ, అవును. తను చనిపోతే ఈ బాధలన్నీ అనుభవించే గతిపట్టదు. తమ్ముడు ఒక్కడైనా సుఖంగా ఉండనీ. తమ్ముని కొఱకైనా తన బ్రతుకు ఉపయోగ పడితే!

గోపి ఇక ఉండలేక పోయాడు. ఎక్కడలేని ఆవేశంతో బావిలో దుమికాడు. మునుగుతూన్న తమ్ముడిని వెళ్ళి కావలించుకున్నాడు. బహుకష్టంగా ఒడ్డుకు లాక్కు వచ్చాడు. అంతవరకే తమ్ముడితోబాటు తనూ నీళ్ళు కావలసినన్ని మ్రింగాడు. తీరంచేరి తనూ క్రిందపడి పోయాడు. అందరూ చుట్టూచేరారు. అంతలోనే కొందరు పెద్దవాళ్ళు వచ్చి ఇరువురినీ ఇంటికి చేర్చారు. అమ్మానాన్నలు జరిగిన

కథంతా పిల్లలమూలంగా విన్నారు. ఇరువురూ బ్రతికి ఉన్నందుకు సంతోషించారు. డాక్టరుచేత పరిచర్యలు చేయించారు. పెద్దవాడి సాహసాన్నిగూర్చి ఉప్పొంగి కొండంతగా చెప్పుకున్నారు. కాని అసలు వాడే చిన్నవాడిని మృత్యువు చేతుల్లోకి త్రోసి, విడిపించుకొచ్చాడని వారికేం తెలుసు ?

మధ్యాహ్నం ఒంటిగంటకు హెడ్మాస్టరుకు ఈ విషయం తెలిసి పరుగెత్తి వచ్చాడు. పిల్లలిద్దరూ క్షేమంగా ఉండటం చూసి సంతోషించాడు. గోపీని పొగి డాడు వాడు చేసిన సాహసకృత్యానికి. గోపి అసలు విషయం చెబుదా మనుకున్నాడు. కాని చెప్పలేక పోయాడు. పూర్తిగా స్వాస్థ్యం చిక్కేవరకూ పిల్లల్ని బడికి పంప నక్కరలేదని అమ్మా నాన్నలకు చెప్పి వెళ్లిపోయాడు. వెడుతూ పిల్లల్నందరినీ ఆ బావికి— ఇతర బావుల్లోకి గూడా— వెళ్లవద్దని శాసిస్తా నన్నాడు.

గోపి ఎప్పటివా డయ్యాడు సాయంత్రం వరకే. కాని తమ్ముడు మాత్రం ఇంకా కొంచెం నీరసంగా ఉన్నాడు. అమ్మా నాన్నలు తన వీరకృత్యాన్ని పొగడు తుంటే తనకే ఎక్కడలేని అవమాన మనిపించింది.

రాత్రిపడింది. తమ్ముణ్ణి ప్రక్కలో ఉంచుకుని నిద్రపోతూంది అమ్మ. తన ప్రక్కనే నాన్న పడుకుని ఉన్నాడు. గోపికి తమ్ముణ్ణి రక్షించే ముందు కలిగిన యోచన ఇంకా మరపునకు రాలా. తమ్ముడుండగా తను అమ్మ వాత్సల్యామృతాన్ని తనివిదీరా ఆస్వాదిస్తా డనేది నమ్మరాని మాట. వాటిని తన మార్గంలోంచి తప్పించ లేదు. అందుకు తన మనస్సొప్పదు. ఇక మిగిలిన మార్గమంతా తను ఈ లోకాన్ని విడవటమే. ఆత్మహత్య చేసుకోవాలి. ఎందరో ఆత్మహత్య చేసుకుంటారని విన టమే; కాని చూడలేదు. విధాలు ఎన్నో ఉన్నా తను విన్నది కొన్నే. ఒకటి : విషం పుచ్చు కుంటారట. కాని విషం తన కెక్కడ దొరకాలి ? అది అసంభవం. రెండోది : ఉరి పోసుకుంటారట, త్రాడుంది. కాని ఎట్లా ముడివేయాలో తెలీదు. ఇదీ లాభంలేదు. రైలుక్రింద పడ్డా చనిపోతారట. రైలుదారి కొన్నిమైళ్లు పెడితే కాని దొరకదు. దొరికినా, సమయానికి రైలు వెళ్లిపోయి ఉంటే ; రైలు ఉన్నప్పటికీ ఏ పోర్టరు చేతిలోనయినా పడితే ; ఇంకేం చావక పోవటముండగా తన్నులు వస్తాయి. ఇదేమీ బావులేదు. మరోవిధమేదయినా ఉందా ? ఆఁ తట్టింది. బావిలో పడితే చచ్చిపోతారట. కాని తనకొలుకు ఇదికూడా నిరర్థకమే. తను గజ ఈత కాదు. ఎట్లా వస్తుంది చావు ? కాళ్లు చేతులు కట్టుకొని బావిలో పడితే ? అవును. బావుంది. ఈ ప్రక్కనే పరుపు త్రాడుంది. తీసుకు వెడతా దీన్ని. కాళ్ళూ చేతులూ కట్టుకుని బావి గడ్డుమీద నుంచి లోపలికి దొర్లితే సరి. తనకు ఈలోకంనుంచి

విముక్తి. అది ఈరోజే చెయ్యాలి. లేకపోతే మళ్ళీ బ్రతుకుమీద ఆశ కలుగుతుంది. ఇకెన్నడూ సాధ్యపడదు. తనకు నరకం మళ్ళీ ప్రాప్తం!

పడుకుని నిద్రపోతూన్న అమ్మను, నాన్ననూ, తమ్ముడినీ ఒకసారి చూచాడు తను. తిన్నగా లేచాడు పక్కమీదినుంచి. అక్కడే పడివున్న పరుపును చుట్టే త్రాడు తీసుకున్నాడు. అందరికీ కడసారి వీడ్కోలు చెబుతున్నట్లుగా మన స్సులో ఒకమారు 'వస్తాను.' అనుకున్నాడు. అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి తలుపు గొళ్ళెం చప్పుడు గాకుండా తీశాడు. తలుపు తెరచుకుని తటాలున అవతలికి వెళ్ళాడు. వెళ్ళినవాడు చక్కా పోలేదు, తెరచిన తలుపును మూయటానికని వెనక్కి తిరిగాడు.

అంతే. ఇక తలుపు మూయలేక పోయాడు. తనకెదురుగా గూట్లో వెలుగు తూన్న ఆముదపు దీపాన్ని చూసి ఆగిపోయాడు. అది చల్లని జ్వాలల్ని గది అంతా చిమ్ముతూంది. దీపంలో ఏదో కన్పడింది. ఏదో ఊహించ సాగాడు.

తనకు ప్రపంచజ్ఞానం కలిగినప్పట్నుంచీ చూస్తున్నాడు, ఆ దీపం అక్కడే ఆ గూట్లోనే ఉంది. రాత్రంతా మండుతూ ఉంటుంది. రోజురోజుకు తను కాలి పోతున్నా అది లక్ష్యపెట్టకండా ఉంది. లక్ష్యపెట్టక పోవటమటుంచి మీదుగా తనేదో ఆనందా న్ననుభవిస్తున్నట్లుగా ఎల్లప్పుడూ మెలగుతూ చల్లని కాంతులను ప్రస రిస్తూంది. దాని వెలుతురులో అందరూ తమపనులు చక్కబెట్టు కుంటున్నారు. ఇంతమంది తనవల్ల లాభం పొందుతున్నారు గదా అని తృప్తితో నవ్వుతూంది. అంతే గాని తను దినదినమూ కాలిపోతున్నాను గదాని ఎప్పుడూ సుంత విచా రాన్నిగూడా మనస్సులో చొరనీయటం లేదు.

తను ఆ దీపాన్ని ఎందుకు ఆదర్శంగా పెట్టుకోగూడదు ? సౌఖ్యాలు తమ్ము డనుభవిస్తున్నాడని అక్కసు పడటం దేనికి ? బాధల్లో సుఖాన్ని చూచిన్నాడు గదా సహజమయిన ఆనందం. ఇంటి వాళ్ళకూ తనకూ సంబంధం కించిత్తయినా లేకండానే దీపం వెలుతురు నిచ్చి తోడ్పడుతూ ఉంది. కాని అమ్మకు, తనకూ ఎడతెగని రాగాను బంధం. తమ్ముడూ, నాన్న తనకు రక్తబంధువులు. అలాంటి వాళ్ళను తిరస్కరించి వెళ్ళిపోవడమా ? ఏదో అమ్మకు తనపైని ఈనాడు ప్రేమ తక్కువైనట్లు అగుపడటం తన దృష్టిలోపమేనేమో ! తమ్ముడు పుట్టక మునుపు అమ్మ తనను ఎంతగా ప్రేమించేది....? తను కొంచం ఏడిస్తే ఆమె సహించలేక పోయేది. తనకే కొంచం సుస్తీచేసినా అమ్మే పస్తులుండేది. తనొక్క నిమిషం కళ్లెదుట లేక పోతే ఆమె హృదయంలో ఆందోళన ! అలాంటి అమ్మను ఈనాడీ

కించిత్ విషయంలో వదిలి....ఆమె ఋణం తీర్చుకోకండానే....తమ్ముడికి నాన్నకూ దూరమై వెళ్లిపోవటం ఏం బాగు? తను నశించిపోయినా ఫరవా లేదు. తప్పకండా బ్రతకాలి. వీళ్ళకేమాత్రమైనా తన జీవితం ఉపయోగ పడేట్లు చూడాలి....తమ్ముడి పట్ల తను ద్రోహం చేశాడు. తనకు జరగాల్సిన సౌఖ్యాలన్నిటినీ వాడనుభవించి పోతున్నాడనే అపోహకొద్దీ వాడిని మృత్యుసన్నిధికి పంపనుంకించాడు. ఈ ద్రోహా నికి తగిన శిక్ష అనుభవించ కుండానే జీవనరంగంనుండి విష్క్రమిస్తే భగవంతుడి పట్ల మరోద్రోహం. బ్రతికి ఉండి తనపట్ల గురువులయిన అమ్మానాన్నలకు, తమ్ము ఏకీ తన జీవితం అంకితం చెయ్యాలి. తను ఏమైనా ఫరవాలేదు. ఈ మధ్యాహ్నం తమ్ముని నీళ్ళలోంచి లాక్కువచ్చింది తనే అయినా త్రోసిందికూడా తనే కదూ; అమ్మా నాన్నలు, మిగతా వాళ్ళంతా తనధైర్య సాహసాన్ని పొగడుతున్నారు. అది తనకే అవమానకరంగా ఉంది. అమ్మా నాన్నలకు నిజం చెప్పాలి. చెబితే వాళ్ళకు తనమీద మరీ ప్రేమ తక్కువవుతుందేమో ! తనంటే అసహ్యించు కుంటారేమో!! చెడమోదుతారేమో....అయితే తను చెప్పకుండా ఉండటమెలాగు? చెప్పాలి. తప్పకండా. అసలు తనకు కావలసింది బాధలేగా. ఈనాటినుండి బాధలు తనకు సౌఖ్యాలు. కన్నీళ్లు తన కమృత ప్రాయం. అసలు సంగతి చెప్పితీరాలి. వాళ్లు తన్నసహ్యించుకోవాలి.

గోపి ఇక ఇల్లు వదల్లేక పోయాడు. ఏదో తనకే తెలియని ఆవేశంతో లోపలికి వచ్చి దభాలున తలుపులు వేశాడు. చప్పుడు విని అమ్మ 'ఎవరదీ?' అని లేచింది. నాన్నకూడా 'ఎవరదీ?' అంటూ లేచి, వెంటనే 'నాయనా గోపి బాబూ' అని పిలిచాడు గట్టిగా—పక్కమీద తడివి చూసుకున్నాడేమో. అమ్మా నాన్న లిరువురూ వచ్చారెదురుగా. 'అమ్మా, నాన్నా' అంటూ వెళ్లి పాదాల్ని చుట్టు కున్నాడు.

"ఏమిటి బాబూ, నిద్రపోలేదా?" అన్నారు ఏకకంఠంతో.

"తమ్ముడిని.... శేషును....నీళ్ళలోనికి త్రోసింది నేనే. కొట్టండి. చంపండి. నేనుండరాదు." అని అరిచాడు బిగ్గరగా.

"ఏం నాయనా, కలగన్నావా? ఊరుకో. ఏం మాటలు." అన్నారు.

"కాదు. నిజమే. నేనే త్రోశాను వాడిని బావిలోకి."

"ఫరవాలేదులే." అంటూ తన్ను లేవదీసి పక్కపై పడుకోబెట్టి ఇరువురూ చెరొక వైపు కూచున్నారు మంచంమీద. గోపికి వాళ్ళనెట్లా నమ్మించాలో తెలి యలా. మంచంమీద పడుకున్నాడు, కాని నిద్రపట్టలా.

అమ్మా నాన్న లిరువురూ మాట్లాడుకున్నారు అబ్బాయి ఏదో కలగన్న ట్లుందని. అంతే. మళ్లీ వాళ్ల గోపి సాహసాన్ని పరస్పరం ప్రశంసించారు. గోపి వినలేక పోయాడు. ఉదయం లేచాడు. తమ్ముడు చనువుగా మాట్లాడాడు. తనకే వాడికి ముఖం చూపించ మనస్కొప్ప లేదు. తను బడి కెళ్ళాడు. తమ్ముడు రెండు మూడు రోజులు రాడు.

* * *

నాలుగైదే ళ్లెట్టే గడిచాయి. ఇద్దరూ పై తరగతుల్లోకి వెళ్ళారు. శేషు ఈ మధ్య బలంకలవాళ్ళలో ఒకడు. వాణ్ణిచూస్తే సాటి పిల్లలకంతా హడలు తంతాదేమో నని! గోపికి మాత్రం శరీరావస్థలో అట్టే మార్పులు రాకపోవట మటుండగా ఏదో మనోవేదనతో దినదినమూ తగ్గి పోతున్నాడు. అమ్మా, నాన్నలు ఎన్నో మందు లిప్పించారు కాని లాభం లేకపోయింది. వాడి ప్రకృతి అంతేనని నిర్ణయించుకున్నా రేమో! అప్పుడప్పుడు ఇతరులతో చెప్పుకుంటారు. 'మా పెద్దవాడు వన్నె హెచ్చటం లేదు' అని.

శేషు తుంటరి అనటానికి వీల్లేదు. కాని వాడికున్న కండరాలు, వాణ్ణి ప్రతి పనిలోకీ త్రోస్తుంటాయి. పిల్లలెవరయినా పోట్లాడితే న్యాయం వున్నవాడిపై పుచేరి అనవసరంగా పేచీపడ్డ వాణ్ణి కీళ్ళు విరగ్గొట్టి పంపుతాడు. తనకు చెందింది అయినా కాకపోయినా, ఏ పేచీలోనయినా తలదూర్చి తన కండరాల పుష్టిని ప్రకటించడం వాడికి హాబీ వల్ల వాడే ఇతరులతో కొన్నిసార్లు తన్నులు తినాల్సిన సమయాలు దాపురించినయి. కాని అవన్నీ గోపి అండగా ఉండటంవల్ల తప్పిపోయినయి.

గోపి మనోరుగ్మతవల్ల కండరాలు తమ్ముడికిమల్లే పెంచలేక పోయాడనే లోపమొక్కటే కాని వాడి వయస్సుకు తగిన బలం మాత్రం క్షీణించలేదు. శారీరక బలంకంటె వాడికి గుండె బలం అధికంగా వచ్చింది ఈ నాలుగైదేళ్ళలో. అమ్మ అప్పుడప్పుడు కోప్పడినా తన మంచితనాన్ని ఎన్నోసార్లు గొప్పగా చెప్పుకుని ఉప్పొంగి పోయిన సమయాలు ఉన్నయి. అయినా గోపికి తన జీవితం సార్థకం చేసికోవాలనే యోచన.

శేషు విన్న అనవసరంగా ఒక పేచీలో తలదూర్చాడు. బడిలో ఒక అల్లరి మూక ఉంది. ఆమూక చదువు పంధ్యల పట్ల శ్రద్ధ సరిగ్గాచూపక పోయినా ఎవ రితో పడితే వాళ్ళతో పేచీ పడటానికి ఏవేళలోనయినా తయారు. ఆమూకలోని ఒక్కడొక్కడూ దుండగీడే. తమ ఏకాంతంలో ఉన్నా ఎదుటి వాడితో పోరాడ టానికి వెనుదీయడు; ఎందు కంటే అవసరమొచ్చి ఒక ఈల వేసేసరికి మూకంతా

పరువెత్తి వస్తుంది. ఈ ధీమా చేతనే ఎవరయినా ఒంటరిగా ఉన్నా మూకంతా తనతో ఉన్నంత బలాన్ని కన్పరుస్తాడు....పోగా నిన్న జరిగిన సంగతేమంటే ఆ అల్లరి మూకలోని వాడొకడు ఒక విద్యార్థిని అనవసరంగా పట్టుకొని తంతూ ఉంటే చూచి సహించలేక వెళ్ళి వాడికి సహాయపడి, అన్యాయ ప్రవర్తన కలవాడిని మక్కీమక్కీ విరగ్గొట్టాడు శేషు. వాడు ఈలవేసే సరికి మూక పరుగెత్తుకు వస్తూంటే వాళ్ళమీదికి రాళ్లు రువ్వి ఇంటికి పారి వచ్చి దాక్కున్నాడు. 'సరే చూసు కుందాం లే' అని వెళ్లిపోయింది జట్టు.

ఆ మూకలోనివాళ్లు ఒక్కొక్కడు శేషుకు కన్పడాలంటే భయపడే వారు. శేషును తమ జట్టులో చేర్చుకోవాలని ఆ మూక ఎన్నోసార్లు ప్రయత్నించింది. కాని శేషు సుతరామూ వీల్లేదన్నాడు. అంతేగాక వీలుచిక్కినప్పుడల్లా వాళ్ళలో ఒకరిద్ద రిని ఎముకలు విరగ్గొడుతున్నాడు. శేషుమీద ఆమూకకు మొదట్నుంచీ కోపంగానే ఉంది.

శేషు పరుగెత్తుకొచ్చి ఇంట్లో పడటంతోనే తీరిపోయిందనుకున్నాడు; కాని ఆజట్టు రాత్రంతా చేసిన ఆలోచనలు, జరిపిన మంత్రాంగాలు చాలా ఉన్నయి. గోపి అందరితోనూ మొదటినుంచీ కలిసి ఉండే వాడు. వాడు ఆమూక శేషునుగూర్చి పన్నిన తంత్రమంతా తెలుసుకున్నాడు ఒకడి ద్వారా.

మరునాడు సాయంత్రం శేషు ఆటలోకొస్తాడు. అప్పుడెలాగయినా వాడితో పేచీ కలిగించుకోవాలి. తరవాత అందరూ కలిసి వాడి పని పట్టాలి. ఒకడు "మాయింట్లో చురకత్తి ఒకటుంది; తీసుకొచ్చి వీలు చూసి డొక్కలోకి పోనిస్తాను వెధవకి. కాని మీరంతా ప్రాణాల మీదికొచ్చినా ఈ విషయం బయటికి పొక్క కుండా వుంటామని నాకు మొదట వాగ్దానం చెయ్యాలి" అన్నాడు. అందరూ విస్తుబ పడి చూశారు. వాడే తిరిగి నూరిపోశాడు: "ఆలోచించండి. శేషుగా డొక్కడు మన దారిలోంచి తొలిగితే మనం సర్వాధికారుల మౌతాం" అన్నాడు. వాడు ఎవడో కాదు; శేషుతో తన్నులు తిన్నవాడే. అందరూ కొంచం ఆలోచించి ఐక్య కంఠంతో సరే నన్నారు.

వాళ్లు జరిపిన మంత్రాంగంలో శేషును దూషిస్తూ, గోపి అంటే ఎంతో సానుభూతి వాక్యాలు పలికారని తెలిసింది. "పాపం! గోపితల్లి విషయం మీకు తెలు సుట్రా? శేషుగాడికి బాగా తిండి పెడ్తుందట. గోపికి అసలు పెట్టనే పెట్టదుట.

అందుకే శేషుగాడు అంబోతులా తయారయ్యాడు. గోపి మీద ఆ తల్లికి ప్రేమే లేదుట" అన్నా డొకడు. ఈ మాటలుగూడా వినేసరికి గోపికి కొంచం కోపం వచ్చింది. అవి నిజం కాకపోయినా వాని మనస్సులో ఏదో ప్రళయం మళ్లీ ప్రారంభమయింది. తను మనిషి కాడూ? తనకు హృదయం లేదూ ? ఒకరి కొఱకు తనెందుకు కష్టాలనుభవించాలి ? తనకూ హక్కుంది. తనూ స్వేచ్ఛగా బ్రతకాలి....కాని మరి తనొకసారి తీసుకున్న శపథం సంగతి ! తను మనిషే ! అందుకే రక్తబంధుల పట్ల తన హృదయాన్ని కోతపెట్టినా ఫరవాలేదు. శేషును, తమ్ముడిని, తన దక్షిణ భుజాన్ని ఈ మూక రేపు ఢీకొంటుందట !

ఉదయం బడికివెళ్లి తరగతిలో కూర్చున్నాడన్న మాటేగాని తనమనస్సు పాతాలమీదికి త్రిప్పలేక పోయాడు గోపి. శేషు గతదినం జరిగిన ఘట్టాన్ని మరచి యథావిధిగా ఉన్నాడు. సాయంత్రం వాడికి గండం తప్పినా కన్నులొట్ట పోతుందనే సంగతి తెలీదు. జరుగబోయే దృశ్యాన్ని ఊహిస్తున్నాడు. మూకంతా శేషు మీద విరుచుకు పడింది. హోరాహోరిగా పోరాటం జరిగింది. ఇంతలో శేషు అమ్మో అని బిగ్గరగా అరచి పడిపోయాడు. ఇంకేముంది శేషు కడుపులోంచి కత్తి దూసుకు పోయింది. అమ్మా నాన్నలు మిన్ను బ్రద్దలయ్యేట్లుగా ఏడుస్తున్నారు.... ఆ ఊహను మళ్లించటానికి క్లాసులోంచి లేచి బయటికి వచ్చేశాడు. నేరుగా ఇంటికి వచ్చేసి ఆలోచించ సాగాడు. 'ఏం నాయనా బడికి వెళ్లవూ ?' అని అమ్మ అడిగిన ప్రశ్నకు 'కొంచం సుస్తీగా ఉంది' అని ముక్తసరిగా సమాధాన మిచ్చి పడుకున్నాడు. అమ్మ జిందాతిలస్మాత్ తెచ్చిరాసి చాలాసేపు కూర్చుంది ప్రక్కన. కళ్లు మూసుకొని ఉండటంచూసి, నిద్రపోయాడనుకొని వెళ్లిపోయింది. ఊహాలకు మళ్లీ కళ్లెం సడలించాడు.

ఈదినం సాయంత్రం శేషుకు గండం. తనురక్షించాల్సిందేనా ? ఎందుకూ ? వాడివి ఆ అల్లరి ముండాకొడుకులతో పోట్లాడమన్నది తనా ? చేసుకున్నంత అనుభవిస్తాడు. తనకేం ? అమ్మ ఏడుస్తుందికద మరి ! వాడు తనకు తమ్ముడాయె ! తన జీవితాశయం ఈ రోజుతోనే సరా ? కాదు. శేషును కాపాడాలి. వాడివి కాపాడ పోతే తన అంత్యం దాపురిస్తే ? ఫరవాలేదు. ఇతరులకు తన జీవితం బలిచెయ్యటమేగా తన జీవితలక్ష్యం. అదిగాక తమ్ముడ్ని రక్షించుకుంటున్నాడు తను. నిజానికి అమ్మ ఈనాడు ఇరువురిపీ సమానంగానే చూస్తుంది. తన కేమయినా లోపం అగుపడుతుంటే అదికేవలం తనకొకవాడు గట్టిగా నాటుకుపోయిన అపోహ. తల్లి పెద్ద

వాళ్లమీద కంటే పెన్నుల మీద శ్రద్ధ చూపటానికి కారణం ఈనాడు అవగత మౌతూంది. పెద్దవాళ్లు తమ కాళ్లమీద తాము నిలువబడ బోతుంటారు కనుక అట్టే పట్టించుకోరు. దీన్ని చూసే తను ఒకనాడు అమ్మప్రేమ తనమీద పన్నగిలినట్లుగా తీర్మానించుకున్నాడు. అంతేకాని మరొహటి కాదు. ఆనాడు తన అమాయకత్వం, తన్మూలంగా రేగిన అపోహవల్ల తమ్ముడిని బావిలో త్రోశాడు. తనే మళ్లీ రక్షించాడు. కాని లాభం? తన మనస్సు మైల పడింది. అది ఈనాడు శేషును ఈ అపాయం నుంచి రక్షిస్తేగాని క్షాళనం కాదు. తప్పకుండా శేషును రక్షించి తను చేసిన ద్రోహానికి శిక్ష విధించుకోవాలి, నిజం.

సాయంత్రం బడివదిలాక ఇంటికొచ్చాడు తమ్ముడు. "ఎందుకమ్మా అన్నయ్య పడుకున్నాడు?" అనడిగాడు అమ్మను. "ఒంట్లో సుస్తీగా ఉందట" అని వచ్చిన అమ్మ జవాబువిని మంచం దగ్గరికొచ్చి తన ఫాలం మీద స్పర్శించిచూసి బయటికి వెడుతున్నాడు. ఆడుకోవటానికి వెడుతున్నాడు కామాలు. "తమ్ముడూ, వెళ్ళొద్దు" అని చెబుదామనుకున్నాడు. కాని చెప్పలేక పోయాడు.

తమ్ముడు వెళ్లటంతోనే తనూలేచి ముఖం కడుక్కుని పోవటానికి తయారయ్యాడు. "ఎక్కడికి నాయనా, బయట గాలి చల్లగా ఉంది. ఇంట్లోనే పడుకో" అంది. కాని అమ్మమాట నేమీ లక్ష్యపెట్టకండా వెళ్ళాడు గోపి.

తను స్కూలు మైదానంలో అడుగు పెట్టే సరికే ఈలలు విన్పడ్డాయి. గోపి అక్కడికి పరుగు తీశాడు. వాళ్లేమేం ఉపాయాల్తో శేషును రంగంలోకి దింపారో తెలీదు. కాని దూరం నుంచి నలుగురైదుగురు పరుగిడి వస్తున్నారు. వాళ్లు శేషును చేరకముందే ఆచోటికి వెళ్ళాడు గోపి. అంతవరకే కుస్తీ పడుతున్న వాళ్లిద్దరినీ ఎదుర్కొన్నాడు. అందు ఒక దప్పగే నడుంలో దాచిన కత్తిని బయటికి తీశాడు. గోపికి భయమేసింది. కాని అంతెరుగని ఆవేశంలో వాడి చేతిని ఒక్క తాపు తన్నాడు. దాంతో కత్తి ఎగిరిపోయి దూరాన బడింది. దాన్ని ఆ పరుగెత్తి వస్తున్న నలుగురైదుగురిలో ఒకరు తీసుకున్నాడు. సమయం మించిందని తెలిసి "తమ్ముడూ శేషూ, ఇంటికి పరుగెత్తిపో. నేను చూసుకుంటా, వీళ్ళని" అని అరచాడు. శేషు పరుగెత్తాడు అమ్మా నాన్నలను పిలుచుక వస్తే బావుంటుందని. శేషుకు కండబలం ఉందికాని అప్పుడప్పుడు గుండె జారిపోతుంది.

లాభం లేకపోయింది. అప్పటికే మసక చీకటి పడుతూంది. శేషు ఇంటికి పరుగెత్తుకెళ్లి అమ్మా నాన్నలను తోడ్కొని వచ్చేసరికే మైదానంలో గోపి పడి

పొర్లుతున్నాడు. అక్కడెవరూ లేరు. అమ్మా నాన్నలు ఏమిచేస్తారు? గోపి కడుపులో దిగిన కత్తిని చూసి అమ్మ తన కడుపు పట్టుకొని బావురుమంది. మూగిన అమ్మానాన్నలను చూసి "తమ్ముడేడీ?" అనడిగాడు బాధగా. ఇక మాట్లాడ లేదెప్పటికీ. అమ్మానాన్నలు కొడుకు నెత్తుకుని వస్తూంటే ఆకాశంలో ఒక నక్షత్రం మినుకుమని మెరసింది. వెంటనే ఒక మబ్బు దాన్ని కప్పేసింది. శేషు "అన్నా, అన్నా" అంటూ దీనంగా విలపించాడు.

వ్యాసము :

# మార్కండేయ పురాణములు - మనుచరిత్రము

— శ్రీ పల్లా దుర్గయ్య, యం. ఏ.

(గత సంచిక తరువాయి)

**శాపవృత్తాంతము :**

చెలులతోగూడ నొక్కనాడు మనోరమ కైలాసంబునకు వినోదార్థం బరిగి తదీయ తటంబున, "ఉగ్రతపమున నెంతయు నొడలు డస్సి, యడరు నాకట నలయుచు మెడమలంచి, చాలగన్నుల గ్రుస్సి తేజంబడంగి, యున్న ముని *గని* నవ్వీన నన్ను జూచి 'నన్ను జూచి నీవు నవ్వితి గావున, నసురపరిగృహీతవగుము తరుణి!" మనోరమ మునిని జూచి నవ్వినట్లును దానికతడు కోపించి శపించినట్లును కలదు. సంస్కృత పురాణమునందును నిట్లే యున్నది. తనను జూచి నవ్వినంత మాత్రమున ముని కోపించె ననుట సరిగా లేదని తలచి, ముని కోపమునకు దగినంత కారణమును గల్పించుటకో యనినట్లు పెద్దన దీని నిట్లు గూర్చెను.

'ఇతని వదనకుహర మెద్ది? నేత్రద్వయం బెద్ది? కర్ణయుగళ మెద్ది? యనుచు, బూచి వోలెనున్న వాచంయముని మోము బాల్యచాపలమున బట్టి'నట్లు వర్ణించెను. దీనిచే ధ్యానస్తిమితుండగు ముని మేనెఱిగి తొంటి యనుసంధానము చెడి దారుణ పణితిని దూలనాడి శపించి తనచేతి నాగబెత్తముచే పసరమును గొట్టినట్లు గొట్టెనట! ధ్యాన సమాధియం దున్న మునిని మొగమెద్ది? నేత్రములెవ్వి? యని వ్రేలితో బొడిచి యతని యనుసంధానమునకు భంగము గలిగించుటచే మనోరమను శపించినట్లు వ్రాయుట సమంజసముగా నున్నది. ఈసందర్భములో

కోపించిన ముని మనోరమను దూషించి యామె పడుచుదనపు బొగరుబోతు తనము వధి శేపించెను. చూడుడు.

'తిమిరంపు వయసు గుబ్బల కొమరాలవు, నీకు దగిన గోవాళ్ళ మహిన్
నెమకి నగరాదె? ముదిసిన, మము జెనకిన నేమికలదు? మదమేమిటికిన్?'

(ఆశ్వా 4, పద్యం 83)

నీవు పడుచుదానవు. నీకు దగిన పడుచు వారిని వెదకి వారితో యిచ్చకములాడు మని తను జెనక వచ్చిన మనోరమను కుపిత వాచంయముడు తూలనాడినట్లు పెద్దన వ్రాసెను. కాని సంస్కృతాంధ్రమూలము లందలి ముని వాక్కులను పైన గమనించితిమి. అందిది యేమియు లేదు.

వరూధిని కథలో కామాతురయై యామె ప్రవరుని నాలింగన మొనరించుకొనిన వెనుక ప్రవరుడు-

మా మాం స్ప్రాక్షీ ర్వ్రజా మ్యత్ర దుష్టే మే ఒసదృశ స్తవ
అన్య న్మయా యాచితం త్వ మన్యత్రై వాభ్యుపైషి మామ్.

అని వరూధినితో నన్నట్లు సంస్కృతమున గలదు. (ఇట నింకను బెక్కు శ్లోకములలో వరూధినీ ప్రవరుల సంభాషణ కలదు) ఈ సందర్భమున పెద్దన్న మూలములోని ప్రవరభాషణమును పూర్తిగ వదలివైచెను. వరూధిని మాత్రము

'పాటున కింతులోర్తురె ? వెలిపెట్టరే బాడబులు పరాశరు బట్టి ?'

అని వాదించుచు బ్రవరు నింకను నిర్బంధించుచునే యుండెను. వరూధిని పలుకులకు ప్రవరు 'దేమియు ననక' శుచియై వహ్ని ప్రసాదమున నింటికేగినట్లు రచించెను. (చూడుడు: "అనిన నేమియు ననక యవ్వనజగంధి మేని జవ్వాది పస గదంబించు నొదలు గడిగికొని వార్చి.........."పద్యం 74) మరిన యీ సందర్భమున మూలమున లేకున్నను

'అంట కంటకు నన్ను మృగాక్షి ! నీకు
సదృశుడగువాని నన్యుని వెదకికొనుము. (పద్యం 246)

అని ప్రవరుని నోట బలికించెను. అంటకంటకు నన్ను మృగాక్షి యనుట బాగున్నది. కాని నీకు సదృశుడగు వాని నన్యుని వెదకుకొనుమని వేదవిప్రుడగు ప్రవరుడు వరూధినితో బల్కుటుత సముచితముగా లేదు. కావున నీసందర్భమున మూలమున నున్న ప్రవర వాక్యములను పెద్దన పూర్తిగా వదలివేసెను. కామోద్రేకముచే బైబడిన దానితో నింకను వాదించి ప్రయోజన మేమి ? కావున ప్రవరు దేమియు ననక యటనుండి వెడలిపోయినట్లు పెద్దన వ్రాసెను. ఇంక నీ సందర్భమున మూలమునందున్న 'నీకు సదృశుడగు వాని నన్యుని వెదకికొను' మను భావమును స్థలాంతరమునకు మార్చి కుపితుడైన మునిచేత మనోరమను గూర్చి 'తిమిరంపు వయసుగుబ్బల కొమరాలవు, నీకు దగిన గోవాళ్ళ మహిన్, నెమకి నగరాదె' యని పలికించు టెంతయు సమంజసముగా మున్నది.

**యుద్ధ వర్ణనము :**

మూలమునందు మనోరమను రక్షించుటకు స్వరోచి యామెను దఱుముచు వచ్చిన రాక్షసునితో యుద్ధము చేయడు. మనోరమ వలన వస్త్ర హృదయమును గైకొని స్వరోచి,

'అని భృకుటీ భయంకరతరాస్యుడు రోష విఘూర్ణితాత్మకుం
డును నయి చండబాణము గడు న్వెస జూడ్కులు దాల్చి చొన్పె న
ద్దనుజునిమేన, దాన బటు శాపము పుట్టిన దల్లడిల్లి య
వ్వనరుహ లోచన న్విడిచి వాడు గరంబులు మోడ్చి యిట్లనున్.

అని యిట్లొక చండబాణము స్వరోచి ప్రయోగింపగనే రాక్షసునికి శాపవిమోచనము కలిగి నట్లు కలదు. రాక్షసుడు స్వరోచితో పోరయత్నింపనైనలేదు. కాని ప్రబంధవర్ణనములలో నొకటైన 'యుద్ధవర్ణనము'ను పెద్దన విపులముగా జేయ నుత్సాహము కలవాడై, పై యిరువురును జాలతడవు పోరినట్లు పెంపెంచి, 20 పద్యముల చివర నొక పెద్ద వచనమును గూర్చి వీరిరువుర ప్రధానముగా యుద్ధమును వర్ణించెను. ఈ యుద్ధ వర్ణనము ఇందలి మృగయా వర్ణనవలె ప్రత్యేకముగ బేర్కొన దగియున్నది. వేటవలెనే యుద్ధములను ప్రత్యక్షముగా రాయలవెంటనుండి పెద్దన చూచియున్నట్లు పెద్దలు చెప్పి యున్నారు. ప్రత్యక్షముగా జూచినవాడు కావుననే పెద్దన యుద్ధవర్ణనము బెంచి రచించెనన వచ్చును. పెద్దన సందర్భ శుద్ధి నీయుద్ధ ఘట్టమునందలి యొకటి రెండు స్వల్పాంశములు మనకు దెలుపజాలి యున్నవి. చూడుడు. రాక్షసునకు వెఱచి సేనలన్నియును యుద్ధభూమి నుండి పారిపోగా నేలపై నరక్షితయై యొంటిగానున్న మనోరమకు రాక్షసబాధ కలుగకుండు టకై వెంటనే స్వరోచి యామెను దన గుఱ్ఱముమీద నెక్కించుకొని పాఱిపోయిన యాటవిక సేనలను ప్రోత్సహింపగా వారు ద్విగుణితోత్సాహముతో పోరి మృత్యుముఖమునం బడిరి. బోయలు రక్కసునితో బోరుచున్న సమయమున మనోరమతో గూడ స్వరోచి గుఱ్ఱముపై నుండి సేనలను ప్రోత్సహించుచుండెనేగాని స్వయముగా యుద్ధము చేయలేదు. కాని సైన్యము లన్నియు హతముకాగా స్వరోచి రాక్షసునితో స్వయముగా పోరవలసి వచ్చెను. యుద్ధసమ యమందు మనోరమను దన యశ్వముమీద నుంచుకొనుటగాని, యొంటిగా నేలపై దింపుట గాని సురక్షితము కాదని యెఱిగి, స్వరోచి ముందుగా నామెను గొంపోయి 'నికట నికుంజా వాసమ్మున భద్రముగా నుంచి తిరిగివచ్చి రక్కసునితో యుద్ధము చేసినట్లును, పిదప నతడు శాపముక్తుడయి గంధర్వరూపమునంది తాను మనోరమ తండ్రి యగు నిందీవరాక్షుడనని తెలుపుకొనుట విని మనోరమ యచ్చటకు వచ్చి నట్లును పెద్దన యెంతయుసందర్భోచితముగా వర్ణించుటజూడ కవి యీ గ్రంథము నెంత జాగరూకతతో రచించెనో మన మూహింప వచ్చును.

**మూలమునందలి మఱియొక యనౌచిత్యము :**

స్వరోచి బాణహతుడయిన రాక్షసుడు శాపముచే దల్లడిల్లి తాను బట్టుకొనిన మనోర మను విడిచిపేసి, శిరములు శోధించి బ్రహ్మమిత్రు డిచ్చిన శాప మిప్పుడు శర్వశాంతి బొందె

నని, స్వరోచి యడుగగా శాపవృత్తాంతమును, దన కులగోత్రాదులను సమగ్రముగా వినిపించి 'ఆయుర్వేదము తోడుగ నీయిందీవరదళాక్షి నిచ్చెద నీకున్, ధీయుత పరిగ్రహింపుము' అని గంధర్వుడు తొల్లిటి తన దివ్యాకృతిని ధరించినట్లు మూలమునందు గలదు. ఇట శాప విముక్తుడైన గంధర్వుడు వెంటనే నిజరూపమును ధరింప కుండుటయు, రాక్షస రూపముతో నట్లేయుండి శాపవృత్తాంతాదుల వివరించుటయు నట్టి వికృతాకారమున నున్న తనకు మనోరమ కూతురని చెప్పి స్వరోచిని దన కిల్లుడవు గమ్మని వేడికొని యటుపిమ్మట గంధర్వ రూపము ధరించెనని చెప్పుటయు బాగుగా గనుపించదు. ఇది స్వల్పవిషయమే యైనను బెద్దన దీనిని సవరించి సందర్భ శుద్ధిగా

భూపతి పావక బాణం బేపున సంధించి తివిసియేసిన మెయి గీ
లాపటలి పొదువ *నతడా రూపం బెడలాని* ఖేచరులు వెఱగందన్ (116)

గగన చరుడయ్యెనని ముందుగా వ్రాసెను. పిమ్మట శాపవృత్తాంత కథనమును, వివాహ ప్రసంగమును నతనితో జేయించెను. ఇచటనే మఱియొక చిన్న విషయము.

**వివాహ ప్రస్తావన :**

శాపమోచనము నొంది రాక్షసుడు గంధర్వుడుగా మారగనే 'నాకు శాపవిముక్తి కలిగించితివి గాన నీవు పుణ్యమూర్తివి. ఈ యుపకారమునకు ప్రతిగా నాకూతురు నిచ్చెదను పరిగ్రహింపు'మని స్వరోచిని వేడినట్లు మూలమున కలదు. (పద్యం 46-47 తెలుగు పురాణము) దీనిని బట్టి తన కుపకారముచేసిన పుణ్యమూర్తి యెవరను విషయము ఇందీవరాక్షునకు దెలిసినట్లు లేదు. ఈ విషయము నతడు తెలిసికొన గోరను లేదు. గంధర్వుడు తన శాపవృత్తాంతమును స్వరోచికి దెలిపెనేకాని యతని వృత్తాంతమును దెలిసికొనలేదు. ఇట్లూరును, బేరును దెలియని వానికి బిల్లనిత్తు నను టెట్లు ? బ్రహ్మమిత్రుడు "ఒక్కరుని దివ్యాస్త్ర వహ్ని నెరియు దప్పుడు *'మది నెఱుక వొడమ'* నిర్మలాకృతి వగుదని యానతిచ్చెనే" కాని స్వరోచి చేత శాప మోక్షితుడవు కాగలవని (స్వరోచి నీకు భర్తకాగలడని కళావతికి పార్వతీదేవి చెప్పినట్లు తెలిపియుండ లేదు. ఐన పై వాక్యములోని 'మది నెఱుక వొడమ' యను దానిచే నతనికి దివ్యజ్ఞానము గలిగినేట్లును దానిచే దన కుపకారి యైనవాడు స్వరోచి యని యతడు గ్రహించి యుండినోపునని (గంధర్వుడు వరూధినీ దుఃఖ కారణమును దన దివ్యజ్ఞానము వలన గ్రహించినట్లు మన మూహించుకొన వలసి యుండునేమో ;) పెద్దనయు నీ సందర్భమున నించుమించు మూలమునే యనుసరించెను. కాని యిందు గొంత విశేషము కలదు. స్వరోచి బాణతాడితుడైన రాక్షసుడు ముక్తశాపుడయి గంధర్వ రూపమునంది భూమికి దిగివచ్చి, స్వరోచి నక్కున జేర్చుకొని కుశల మడిగి 'నే నిందీవరాక్షుడను గంధర్వుడను. మీతల్లి కిరవాడగాని, కడవాడగానని యతనితో బల్కినట్లు మనుచరిత్రమున గలదు. (అశ్వా 5 పద్యం 21) దీనిచే దన కుపకారము చేసినవాడు వరూధినీ నందనుడగు స్వరోచియేయని యిందీవరాక్షుడు గుర్తించినట్లును, పిదప గూతు నీయ నిశ్చయించినట్లును, పిమ్మట దన మనోరథమును సూచించుచు* యన్నట్లు 'పెండ్లికొడుకవు కమ్మని దీవించి మనోరమ తనకు

కూర్మినందనయని తెలిపి, యాపిమ్మట నిజశాప వృత్తాంతము వివరించి చివరకు 'ఈ యుప కారమునకు ప్రతిసేయగ శక్యంబె... ' యని ' ఆయుర్వేదము గైకొని యీ యింతిం బెండ్లి యాడు ' (ఆశ్వా 5, 28-29) మని చెప్పినట్లు చేసిన కల్పన మెంతయు నౌచిత్య పోషకముగా నున్నది.

పంచమాశ్వాసము :

ఐదవదగు నీయాశ్వాసమునందలి ప్రధానవిషయము మనోరమా స్వరోచుల వివాహము. ఈ విషయము తెలుగు పురాణమునందు "అనుదు రాగంబు నొందిన యత్తనూజ, నక్కు-మారున కిడి వివాహంబుజేసి, దివ్యగతి నేగె నంత నిందీవరాక్షి, డనఘ ! గంధర్వపురమున కతిరయమున." (ఆశ్వా. 5, పద్యం. 53) అని సగము పద్యములో నిట్లు ముగింప బడినది. ఇక సంస్కృత పురాణమున నిది

"తతః పిత్రా స్వయం దత్తాం కన్యాం తాం సవిధానతః
ఉపయేమే *గిరౌతస్మిన్* స్వరోచి శ్చారులోచనామ్."

అని యిట్లొకే శ్లోకమున జెప్పబడి యున్నది. దీనిని మారన 'అత్తనుజ నక్కు-మారున కిడి వివాహంబుసేసి' యని మఱింత క్లుప్తముచేసి యొక్క మాటతో జెప్పి యూరకొనెను. ఉభయ మూలములందింత సంగ్రహముగా నున్న వీరి వివాహమును ప్రబంధ లక్షణానుగుణముగా వర్ణింప నెంచి పెంచి యించుమించు 76 పద్యములలో వ్రాసెను. ఆశ్వాసాది నున్న గంధర్వుని శాపవృత్తాంతమును విడిచి చూచిన దక్కిన పంచమాశ్వాస మంతయు వివాహ వర్ణనమే. ఇంతగా బెంచి పెద్దవ వ్రాసిన యీ వైవాహిక వర్ణనమునకు మారన మార్కండేయ పురాణములో నాధార మెంత మాత్రము లేకుండు టటుండ సూచనరేని కానరావు. ఇప్పట్టున మను చరిత్రము నందలి యుద్వాహ వర్ణనమునకు సంస్కృత పురాణమే కొంత యాధారమని యూహించుట కవకాశమున్నది. పై మదాహరింప బడిన శ్లోకమునందలి 'సవిధానతః ఉప యేమే గిరౌతస్మిన్' అను పొడి మాటలను సూచనగా గ్రహించి ప్రతిభాశాలియు, లోకజ్ఞాన సంపన్నుడునగు కవితాపితామహుండు మనుచరిత్రమునందలి పంచమా శ్వాసమునకు(దాదాపు) కవితా వస్తువును సమకూర్చుకొన గలిగెను. గిరౌతస్మిన్ అను పదములనూతగాగొని మందర గిరి వర్ణనము తత్ప్రయాణాదికమును, మఱియు 'సవిధానతః' యను దానిచే వివాహమును విధివిధానముగను ససంప్రదాయముగను సాంగోపాంగముగను చక్కగా వర్ణించెను. ఇట్లు చేయదేని నీయైదవ యాశ్వాసమునకు గథావస్తువు లేదుకదా ? ఇట్లెంత పెంచినను నీయాశ్వాస మించుక చిన్నదగునని తోచుటచే, న్యాయముగా ఇందీవరాక్షుడు శాపవిముక్తి నొందగనే వెంటనే చతుర్థాశ్వాసము చివరనే చెప్పదగియున్న యతని శాపవృత్తాంతమును పెద్దవ ఐదవ యాశ్వాసము మొదటికి లాగివైచి యించుక పెంచి, వివాహవర్ణనకు దోడుచేసికొని యిట్లత్యద్భుతముగా నుమారు వంద పద్యములతో నైదవ యాశ్వాసమును వ్రాసి ముగించెను. చెలుల శాపవృత్తాంతము నిందే వర్ణించినచో నిది పెరిగి పోవుటయేగాక తర్వాతి యాశ్వాసము తఱిగి పోవుటయు సంభవించును గావున దానిని ఆఱవయాశ్వాసము మొదటికి

జరిపివైచెను. ఈ యాశ్వాసము నందలి 29 వ పద్యము పిదప "అనిపలికి గంధర్వుడు తన పుత్రికను స్వరోచి కిచ్చి వివాహ మొనరించి కవ్వపుకొండ కేగె" ననియొక చిన్న వచనము వ్రాసి ముగించినను లేదా యీ మొదటి భాగమును నాల్గవ యాశ్వాసము చివరకు నెట్టినను కథాగమనమున కావంతేని భంగము కలుగదు. అట్లు చేసితిమేని మనుచరిత్రమున ఐంచమాశ్వాసము లోపించి పోవును. పెద్దన మనుచరితము నాశాశ్వాసముల ప్రబంధ ముగా రచింప దలచెను గాన కథావస్తువు నిట్లు పెంపుచేసి కొనెను. చతుర్థాశ్వాసములోవి వేట, మఱియు యుద్ధ వర్ణనములు నిట్టివే. ఈ పంచమాశ్వాసమున నొకచిన్న యౌచి త్యమును గమనింప నచ్చును. కన్యాత్వమును బోగొట్టి 'ఐదువతనము'ను బ్రసాదించునట్టి వైవాహిక విషయమును 'ఐదవ' యాశ్వాసమునకు గవితా కథా వస్తువుగా బెద్దన్న గ్రహించుట యందలి సారస్యము ప్రత్యేకముగా గమనింపదగియున్నది ; ఇట్లు మూలాతిరిక్తమయ్యును మూలావిరుద్ధమైన యీ యైదవ యాశ్వాస మించు మించు పెద్దన స్వోపజ్ఞకు మగుట విది యెంతయు ముఖ్యమైనది. పంచమాశ్వాసములోని యీ వివాహవర్ణనము, చతుర్థా శ్వాసము లోని మృగయావర్ణనము వలెనే ప్రత్యేకముగా వివరింప దగియున్నది. ఈ యాశ్వాస మందలి వివాహ ఘట్టమును చతుర్థాశ్వాసము లోని మృగయా యుద్ధఘట్టములను మూల కథ యందలి మార్పులుగా చెప్పుటకు వీలులేదు. వీనిని చేర్పులని చెప్పవలెను. ఇట్టి వీ ప్రబంధమున నటనట వింకను లేకపోలేదు.

షష్ఠాశ్వాసము :

సఖీజనశాపవృత్తాంత కథనము :-

శాపోపశమనముచే నిజరూపమును దాల్చిన యిందీవరాక్షుడు "స్వారోచికి నాయుర్వేద విద్యనిచ్చి యకన్యక నీయ నుపక్రమించిన నది తండ్రి కిట్లనియె.

మన కుపకారియైన సుకుమారుని నీతనిఁ జూచి నప్డ నా
మనమున రాగమైనయది మాఘుగ, నైనను దండ్రి ! నాకతం
బునఁ బటు రోగదుఃఖములఁ బొందుచు నెచ్చెలు లిట్టులుండగా
మనసిజ భోగలీలలకు మానన మెమ్మెయి నాకు నూల్కొనున్ ?

అనిన వరూథినీ తనయుం డయ్యింతి కిట్లనియె.

ఆయుర్వేదము పెంపున, నీ యిద్దఱు సఖుల రోగనిర్ముక్తలఁగా
జేయుదు నమ్ముము విడువుము, తోయజదళనయన ! వగపుతో సంశయముల్

అనుడు రాగంబునొందిన యత్తనూజ
నకుమారున కిడి వివాహంబుచేసి
దివ్యగతినేగెనంత నిందీవరాక్ష
ఁడనఘ ! గంధర్వపురమున కతిముదమున.

ఎలమిమై స్వరోచి యిట్లు మనోరమఁ
బెండ్లియై కరంబు ప్రీతితోడ
సతియు దాను దాని సఖులున్ను యుద్యాన
వనమునకును నేగ వారు గాంచి.

దివ్యౌషధంబులచే వారి రోగనివారణలు చేసినట్లు మార్కండేయ పురాణమునందు కలదు. పై పద్యములను జూచిన నిందు చెప్పఁబడిన విషయముల క్రమ మిట్లున్నది. ఇందీవరాక్షుడు మొదట స్వరోచికి ఆయుర్వేద విద్య నిచ్చి పిదప పుత్రికనీయ నుపక్రమించుట, మనోరమ స్వరోచి వినుచుండగా తన తండ్రితో దనకు స్వరోచిని జూచి నప్పుడే యతనిపై ననురాగము కలిగిననదనియు నీ వివాహము తనకు సమ్మతమే యని యనుట, అట్లయ్యును చెలులు దుఃఖము ననుభవింపుచుండగా 'మనసిజ భోగలీలలకు' దన మానసము నూల్కొన జాలకున్నదని తండ్రితో చెప్పుట, అది విని మనోరమతో ఆయుర్వేదము పెంపున చెలుల రోగము మాన్పగలనని నమ్మబలుకుట, ఇందీవరాక్షుడు వారికి వివాహముచేసి నిజపురికేగుట, పిదప మనోరమతో నుద్యానవనమున కేగి స్వరోచి యామె చెలుల రోగములను మాన్పుటయు నను విషయము లీక్రమమున చెప్పఁబడినవి. సంస్కృతమున నిట్లే కలదు.

మనుచరిత్రమునందు పెద్దన్న యిందలి కొన్ని విషయములను తలక్రిందులుగ చెప్పుటయేకాక మఱికొన్నిటి నిటమండి స్థలాంతరమునకు మార్చెను. మనుచరిత్రమందలి క్రమ మిట్లున్నది.

ఆయుర్వేదము గైకొని, యీయింతిం బెండ్లియాడు మెలమి రమానా
రాయణ పరిణయ గేయ వినాయన గంధర్వమైన శివ్వాలు కొండన్.

ఆశ్వా 5 పద్యం 29

ఆయుర్వేదముగైకొని యీయింతిని బెండ్లియాడు మని గంధర్వుడు ఆ విద్య యెప్పుడు స్వరోచి కిచ్చెనో యిందు మూలములోవలె స్పష్టముగా పెద్దనచెప్ప లేదు. తర్వాతవివాహసమయమున గాని కల్పము లొపగునప్పుడుగాని యొసగినట్లును వ్రాయలేదు. కాని మనోరమ చెలుల రోగములనుగూర్చి చెప్పగా స్వరోచి

'పరితాప మింక నేటికి
హరిణాక్షీ ! మదీయ సంచితా యుర్వేద
స్ఫురణమున బరిహరించెద
వరుదవగ భవత్సఖీజనామయ భరమున్. (ఆశ్వా 6 పద్యం)

అని స్వరోచి చెప్పుటచే వింతకు పూర్వమే గంధర్వ డాయుర్వేదము స్వరోచి కిచ్చినట్లు తెలియుచున్నది. ఇది నట్లెచ్చటను ప్రత్యేకముగఁ జెప్పబడకుండుటవలన, మొదట ఆయుర్వేదము గైకొని యీ యింతిం బెండ్లియాడుమని యని నప్పుడే (మూలములోవలె) దానిని స్వరోచి కిచ్చెనని మనము గ్రహింపవలెను. ఇట్లాయుర్వేదము నొసగిన యనంతరము మనో

రమను *కవ్వపు కొండయందు* పెండ్లియాడుమని చెప్పి యా విధముననే మనోరమా స్వరోచు లను దనతోగూడ *కవ్వపు కొండకు దోడ్కొనిపోయి* యచ్చటనే వైభవముతో గన్యాదానము గావించెనని మనుచరిత్ర మనుచున్నది. ఇందు వివాహము వేటాడిన యరణ్యమున గాక మందరాద్రియందు గంధర్వుని యింటిలో జరిగెను. చెలుల రోగ విషయము నొకనాడు *శయ్యా గృహముననున్న* సమయమున మనోరమ స్వరోచికి జెప్పినట్లును, అది విని, చింతింపవలదనియు నాయుర్వేదము పెంపున వారిరోగముల నివారింతుననియు స్వరోచి భార్యతో గూడ వనమునకేగి యౌషధములచే వారిరోగములను మాన్పినట్లును పెద్దన వ్రాసెను. ఇందు గంధర్వుడు స్వరోచితో దన పుత్రికను వివాహము గమ్మని కోరినసమయమున మనోరమ జనకునితోగాని స్వరోచితోగాని చెలుల రోగ వృత్తాంత మేమియు మాటలాడదు. మౌనము వహించి స్వరోచితో దన వివాహమున కంగీకారమును దెల్పెను. పిమ్మట నిందీవరాక్షుడు మనోరమ స్వరోచులతో గవ్వపు కొండ కేగి యట బంధుమిత్రసమక్షమున సవిధానముగా కన్యాదానము చేసెను. మూలములో నిందీవరాక్షుడు మనోరమను స్వరోచికిచ్చి యావనమందే వివాహముచేసి నిజపురి కేగెనని కలదు. దీనిని పెద్దన్న పైవిధముగా మార్చెను. చెలులవృత్తాంత మును వివాహమునకు బూర్వము తండ్రితోగాక మనోరమ వివాహానంతరము శయ్యా గృహ మున భర్తయైన స్వరోచితో దుఃఖితయైనయామెచే చెప్పించినాడు పెద్దన్న. ఈ మార్పునుగూర్చి యాక్షేపణ కలదు. మనోరమ శయ్యాగృహమున భర్తతో తన చెలులు వ్యాధిగ్రస్తలయి యున్నట్లు పెద్దన్న చెప్పించుట బాగులేదట ; శయన గృహమున నిట్లు భర్తతో గోరుట సాంసారిక స్త్రీ పద్ధతి కాదట ; ఇది వేశ్యాసంప్రదాయమట ; ఇది యాక్షేపణము. కాని యించుక విచారించిన నీ యాక్షేపణ సరియైనది కాదనుట స్పష్టముకాగలదు. పెద్దన్న యిట్లు మూలము నకు గొంత వ్యతిరేక కల్పనము చేసిన ట్లగపడినను బరిశీలించి చూచిన నీమార్పునకు మూలమే యాధారమనియు, నిది కేవలము స్వతంత్రించి పెద్దన చేసినది కాదనియు, మూలమునందున్న విషయమునే మఱింత యుచితముగా జెప్పుటకే యిట్లు గల్పింపబడె ననియు గోచరించును. ఇందీవరాక్షుడు మొదట ఆయుర్వేద విద్యను స్వరోచి కిచ్చివైచి, పిమ్మట మనోరమ నీయసంకల్పించెను. అపుడు మనోరమ తన చెలులు విస్మృతచే దుఃఖించు చుండగా తనకు మనసిజ *భోగలీలలకు* మనసు నూల్కొనుట లేదని వచించెను. ఆయుర్వేదమును స్వరోచి కిచ్చిన పిమ్మట తండ్రితో చెలుల జాడ్యమును గూర్చి చెప్పుట వలన ప్రయోజనమేమి? ఆయుర్వేదము నతని కిచ్చుటకు బూర్వ మిట్లు చెప్పిన గొంత లాభ ముండెడిది. ఇప్పుడు రోగవిషయము జెప్పి, చికిత్స వేడవలసినది స్వరోచిని. ఐన నతడు కాబోవు భర్త యగుట వలన నిదివఱలో ప్రాణరక్షణమును వేడుకొన్నదే యైనను నిపుడు తండ్రి తన నతని కిత్తునని చెప్పుటచే తండ్రి యెదుట నతనితో సంభాషించుటకు సిగ్గిలి తండ్రి నడిగి యుండునని మూలములోని యీ విషయమును సమర్థించుకొన వచ్చును. వివాహ ప్రస్తావన విని మనోరమ తనకు స్వరోచియందు రాగము బొడమినదని చెప్పి, చెలులు దుఃఖితులయియుండ మనసిజ భోగలీలకు మనసు నూల్కొనుట లేదని చెప్పెను. తండ్రి పెండ్లి యొనర్తుననెను. నానా స్వరోచియందనురాగము కలది. ఇట్లుండ వివాహము జేసికొనవచ్చును కదా ; ఇచ్చట

'మనసిజ రోగశీలం' ప్రసక్తియేల? అదియును కాబోవు భర్త వినుచుండ తండ్రితో చెప్పు టేమి బాగున్నది? ఒకవేళ చెలుల వ్యాధిని గూర్చి యంత విచారమున్న యెడల, నాయుర్వేద విద్యను దన కన్నులయెదుటనే తన తండ్రి స్వరోచి కిచ్చెనుగదా! ముందు వివాహము చేసికొని భర్తతో వారి రోగము కుదిరింప వచ్చునుగదా! చెలుల రోగవృత్తాంతమును గూర్చి పెండ్లికిముందు చెప్పినను, పిదప చెప్పినను తండ్రితో చెప్పినను, స్వరోచితో చెప్పినను వారికి చికిత్స చేయవలసినవాడు స్వరోచికదా! వివాహ పూర్వమున చెప్పిన మాత్రమున వెంటనే నయమొనర్చునా? లేదు. తండ్రి విని యూరకుండెను. స్వరోచి 'ముందు వివాహము జరుగనిమ్ము. పిదప నేనున్నాను. ఆయుర్వేద మున్నది. నీచెలుల కేమి భయములే'దని ధైర్యము చెప్పి యామెను పెండ్లాడెను. ఇది మూలము.

ఇది యిట్లుండుట జూచియే పెద్దన మనోరమా స్వరోచుల మనోరథములు గనిపెట్టి మొదట గంధర్వునిచే నాయుర్వేదమును స్వరోచి కిప్పించెను. పిదప 'నీకు నాకూతురు నిత్తును. పరిగ్రహింపు' మని గంధర్వునితో బలికించి, యతనియం దనురక్తయైన మనోరమ నోటికి మౌనముద్ర వేసెను. ఇందీవరాక్షుని వారిపురికి గన్యాపుకొండయందు విధివిధానముగా వివాహము కావించెను. వివాహానంతరము మొదనాటి చక్కగా నలంకరించిన కేళీభవనమునకు మనోరమ నలంకరించికొని తెచ్చి స్వరోచికిచ్చి వదలిపోయిరి. అంత స్వరోచి చిత్త మువ్విళ్ళూరగా 'దట్టంపు నీ కట్టినట్టి చెంగావికి దాగునాదని కేలబయట నిమిరెడినను నీ మొదలుగాగల విలాస శృంగార చేష్టితములచే నా నవోఢ మెనకు గిలిగింతలుపెట్టి అనునయమున్న హాసములు బలికించి చూచు నెపమున మున్ముందువలె నక్కున జేర్చెను. 'ఇట్లు కపియంబ దమకించి ప్రస్తుతుల గుస్తరింప నింపు గిలిగియు మునుమున్ను మనంబునం బొడమియుండు నత లప్పుడు తలంపునం బొడమ సిమ్మట్టుండిగు వలనిచే నది తీర్పంచుకొనం గలదియై శ్రీ స్వభావంబునం దొలగు నిష్పటి గారవాలు మీటుచు నూరక యున్నం జూచి స్వరోచి యట్టి యానంద సమయమున దుఃఖకారణ మేమని యడుగగా మనోరమ -

"అక్కట నాయెడ నిగుల నక్కజపు గిర్గి వరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రు శాపహతి జెందిన దుర్దమ రోగ బాధలన్
బొక్కుచు నున్నవారు వనభూముల, దద్దశ మాన్పలేని నా
కెక్కడి సౌఖ్య మన్న దరకేశుల జూచి స్వరోచి...."

మరియు సంచితాయుర్వేద స్ఫురణమున భవత్సఖీ జనామయమును బరిహరింతునని చెప్పి యామెను దోడ్కొని వారున్న వనమునకేగి యౌషధములచే రోగము మాన్పినట్లు పెద్దన వర్ణించెను. పై విషయమును గమనించిన చెలుల వృత్తాంతమును శయ్యామందిరమున మనోరమతో స్వరోచి కేల చెప్పించెనను మనకు సులభముగ దెలియును. మూలమునందున్న దోషమును సవరించి సరిచేయుటకే పెద్దన యీ మార్పు చేసెనని తెలియు చున్నది. మనోరమకు స్వరోచిని వివాహమాడుట యిష్టము కావున ముందుగా వివాహము జరిపించెను. తనతండ్రి యాయుర్వేదమును స్వరోచి కిచ్చెను గాన తండ్రిముందు చెలుల రోగ ప్రసక్తి తెచ్చు

టనవసరమని యామెచేత మౌనము వహింప జేసెను. చెలులు వ్యాధిచే దుఃఖించుచుండగా మనోరమ తన మనసు 'మనసిజ భోగలీలలకు' సూల్కొన జాలదని చెప్పినట్లు మూలమున నుండుటచే దాని ననుసరించి యట్టి సన్నివేశమును గల్పించి వివాహానంతరము పెద్దన మనోరమా స్వరోచులను కేళీ గృహమునందు జేర్చెను. పిదప మనసిజ భోగలీలల దేలుట కనువయిన యట్టి యానంద సమయమున నామెకు చెలుల రోగ వృత్తాంతమును జ్ఞప్తికెల యించి, భోగ వైమనస్యమును గల్పించి, తన్మూల నీరసించి భర్తతో నై విధమున పెద్దన చెప్పించుట మూలమునకు ననుసరణముగను వివరణముగను నున్నదేగాని తద్విరుద్ధ మెంత మాత్రమును గాదు. ఇట్లు చెప్పుటచే మనోరమ కుటుంబస్త్రీల మర్యాదల నతిక్రమించెనను కొనుట వట్టి యపోహము. వివాహమునకు బూర్వము మూలములో వలె 'మనసిజ భోగ లీలలకు' మనసు సూల్కొన జాలదని చెలుల వృత్తాంతము చెప్పుట యప్రస్తుతము. తండ్రి మందట్లు వడివడి వినగా జెప్పు టధిక ప్రసంగము. వివాహానంతర ప్రథమ సంగమ సమయమున వచ్చిన యేకాంతకాలమున భోగ వైమనస్యమును గలిగించి చెలుల వృత్తాంతమును జెప్పించి సఖులయెడ మనోరమకుగల గాఢమైత్రిని బ్రకటము చేయుటేగాక మూలము నందలి 'నెచ్చెలులు రోగ దుఃఖముల బొందుచుండగా మనసిజ భోగలీలలకు మానస మెట్లయి నాకు సూల్కొను'నను మనోరమ వాక్యమును సత్యవాక్యముగా బెద్దన నిరూపించినవా డాయెను.

### కళావతి వృత్తాంతము :

మనోరమ నెచ్చెలియగు కళావతి వృత్తాంతము మూలమున నయిదారు పద్యములలో సంగ్రహముగా గలదు. పెద్దన దీనిని పెంచి షష్ఠాశ్వాసములోని 19 నుండి 58 వరకు గల నలుపది పద్యములలో హృద్యముగా వర్ణించెను. సంస్కృత పురాణమున కళావతి జన్మ వృత్తాంత మిట్లున్నది.

కుమార బ్రహ్మచా ర్యాసీత్ పారో నామ పితా మమ
బ్రహ్మర్షి స్సుమహాతేజా వేద వేదాంగ పారగః
తస్య పుంస్కోకిలాలాప రమణీయే మహా పురా
ఆజగా మాప్సరోభ్యావం ప్రఖ్యాతా పుంజికస్థలా
కామం వైక్లబ్యతాం వీత స్స తయా మునిపుంగవః
తత్సంయోగే ఽహ ముత్పన్నా తస్యాం తత్ర మహాచలే.

పారుడను బ్రహ్మర్షి యొక డుండెననియు, నతని కడ కొకనాడు పుంజికస్థలయను నప్సరస రాగా నతడామెను కామించెననియు, వారిరువురికి కళావతి పుట్టెననియు దీనిభావము. దీనిని మారన

'అలికుల కీర కోకిల కలారవ రమ్య మహీజరాజిచే
బొలుపగు నమ్మునీశ్వరు తపోవన భూమికి వచ్చె పుంజిక

స్థల యను నప్సరోంగన ముదంబున దాని విలాసలీల జూ
డ్కల పులకొన్న బైబడి కతు స్తనమకంబున దాను వింతియున్.

ఇష్టోపభోగములనుండ కళావతి జన్మించినట్లు మారన వ్రాసెను. పారునికి 'తపోవనభూమి' మారన కల్పించి యిచ్చినదే. ఇది మూలమున లేదు. మఱియు పుంజికస్థల విలాసము వీక్షించి పారుని దానిపై బడినట్లు మూలమున లేకున్నను మారన వ్రాసెను.

పెద్దన తెలుగు పురాణము నందలి 'తపోవన భూమి'కి పుంజికస్థల వచ్చెనను సూచనను గ్రహించి దీని విట్లు గల్పించెను. పారుడు తపముజేయ తలపోసి కిరశృంగాలి రమ్యమైన యాశ్రమమున బంచాగ్ని మధ్యమున ఘోరతపము చేయుచుండగా నలవాటు ప్రకారము దేవేంద్రుని మది యదరెత్తిపోయెను. అంత నతడు పుంజికస్థల యను నచ్చర లేమను నతని తపము చెఱచుటకు బంపగా

'చిలుకల ముద్దు బల్కులకు జేసగరా నెఱివేణి కాంతికిన్
మలయుచు బైపయిన్ మధుప మాలిక పాయక సంచరింపగా
నలస విలాస యానమున నమ్ముని పాలికి వచ్చె వేల్పు బో
ట్కాలి ముసుపాన బట్టిన యనంగుని మోహన బాణమో యనన్.

అని యిట్లు పుంజికస్థల పారునికడకు వచ్చుటకొక కారణమును కల్పించెను. పిదప యువతి యువకోటి కోరికల జిగుర్చు చెత్తించు వసంతము నెంతయు స్వాదుతమ మధుర ఫణితిని వర్ణించెను. ఈ వసంత వర్ణనము చదువదగినది. ఇట్టి సమయమున నసలు చిదుము నెపమున నాశ్రమము జొచ్చి యచటి యశోకపృతి శ్రుతియందు కంఠము మేళవించి 'సన్నారవళి పాటలు' పాడుచు నొయ్యారముగ నోరగంట తపసిని జూచెనట; అంత

'తంకొని దాని తమ్ములపు దావియు మోవియు గొను మేను స
గ్గంపు మెఱుంగులీను తెలిగన్నులు జన్నులు భృంగమాలికన్
గెలిచిన యాపతీరు దగు నెన్నడయుం దొనయన్ వివేకముం
గలపగ గాంచి పంచశర కాండ విఖండిత ధైర్యసారుడై.
మేను గడుపాఱ దమి నమ్మౌని జవము దవము దన్ను మఱవ యనంగ
గ్లానిబడి కదిసి నడకుచు హీనస్వర మెసగ బ్రోవవే నన్ననుచున్.

పుంజికస్థల చేయిదట్టి బ్రతిమాలుకొనగా నది యందులకే వచ్చినది గావున నవశ చందాన 'బైబ్రాలె'నట;

ఇదియంతయు పెద్దన కల్పనయే. మూలమున పారునియొద్దకు పుంజికస్థల వచ్చెనని యూరకామన్న దీని నింతగా నేల పెంచెనని యాలోచించితిమేని దీనికి గారణము తాను మొదట సృష్టించిన ప్రవరుని గుణగణముల కౌన్నత్యము నాపాదించుటకేయని యూహింప వచ్చును. సామాన్య విప్రుడగు ప్రవరుడు తన యభ్యాస వైరాగ్యములచే నతి చంచలమైన మనసు నరికట్టి 'యతేయమాగు' కామము నవలీల జయించిన దిట్ట. 'ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో

బాలింతల్లు పొంగార బైబడిన యచ్చర మచ్చెకంటిని ధీరచిత్తుడై యంసద్వయ మంటి పొమ్మనుచు ద్రోచి యవ్వనజగంధి మేని జవ్వాదిపస కదంబించు నొదలు గడిగికొని వార్చి శుచియై వెనుదిరిగి చూడకపోయిన యకాముకుడు. మీసాలపయి తేనియలవంటి తుచ్ఛ సుఖములయెడ 'మనసు రాయి జేసికొనిన' పాషాణమూర్తి. ఈ పారుని జూడుడు. విద్యలెల్ల నభ్యసించి ఘోరతపముచే బహుహూతుని మనసున బుగులెత్తించిన మునిపుంగవుడు. తపోరాశి. ఇట్లయ్యును నొక యచ్చరలేమ యంగసౌందర్యమును గాంచిన మాత్రమున మేను గడపాఱ వివేకముజెడి పంచశరుని పంచలోనిబంటుగామారి, జపము, తపము, ధర్మమ మఱచి యనంగగ్లానికి నలమటించి హీనస్వరమున ద్రోవవే నన్నని చెయ్యిబట్టి హీనదీన స్వరమున రతిభిక్ష వేడిన భీరుడగు నిరాచారి. వరూధిని జెప్పినట్లు తామరస నేత్ర లిండ్లబందా లనదగిన యినుప కచ్చడము గట్టిన మునిమ్రుచ్చు. స్వరోచికి జనక ప్రాయుడు ప్రవరుడు. ఆ స్వరోచికే కాబోవు యిల్లాలి జనకుడు పారుడు. ప్రవరునకు బాపిన కెంతవాని గలిగించి నాడు పెద్దన! ఇది యంతయు పారుని పాత్రకు ఔన్నత్యము చేకూర్చుటకు గాక మతెందులకు? ఇటు మూలమున మారన పాడుడు పుంజికస్థల 'పైబడి' నట్లు వ్రాయగా దానిని 'చేయిబట్టి' ద్రోవవే నన్ననినట్లు మార్చి పాడునియందు గొంత సభ్యత నాపాదించెను. 'పైబడి' యన్న మారన మాటను స్థానాంతరమునకు మార్చి, ఎంత వాదించినను, వెన్ని యాసలు చూపినను వినుకేని గరగక మనసు రాయిచేసి యెదుట నున్న ప్రవరుని వీరు దేఱ తెలిగన్నుల బయ్యాపుఱ్ఱాన జూచుచు వెతలం బెట్టకు మింక నన్ననుచు... రతి సంబంధము మీఱ నిర్ధరి వధూరత్నము 'పైబడె' నని యీ 'పైపాటు'ను కామోపభోగమే జీవిత పరమ లక్ష్యముగాగల వరూధినికి గట్టి పెట్టెను. ఈ విధమున మూలములోని ప్రతి స్వల్ప విషయమును, ప్రతి పదమును 'పదేపదే' చూచి చూచి, తూచి తూచి పరీక్ష కాగిన వానినలై పరిగ్రహించుచు, నట్లుగానివాని నన్యథాకరించుచు, నర్థౌచిత్యములయందు, రస రామణీయకములందు దృష్టినిలిపి మనుచరిత్రమును రచించెననుటకీ పాడుని వృత్తాంతమును, నేనీవఱకు జూపిన పలుతెఱగుల చిఱుమార్పులును జాలునుగదా!

పారర్షి హత్య:

ఇది కళావతి వృత్తాంతాంతర్గతమే. మూలమునం దిది యొక పద్యమున నిట్లున్నది:

"........చంద్రకళా వర్తిం నగుటం గళావతి యను నామంబు నాకొనరించె. అంత

నొక్కనాడు దేవాదియను గంధర్వుడు

తనకు నను నీని యలుకం గనలుచు జనుచెంచి మత్తకరి విధమున మ
జ్జనకుని వధియించిన, నే మనమున నిర్వేదమొంది మరణోద్యమమున్."

దేవాదియను గంధర్వుడు కళావతిని దన కీయకుండుటకు బారునిపై కోపించి తన జనకు వధియించెనని కళావతి చెప్పెను. సంస్కృతమున నిది యిట్లే కలదు. పెద్దన దీని నిట్లు వివరించెను.

"ఎవ్వరు జూచిన జూపుల చివ్వకు బడసవిగి నడుచు నిగ్గున నొఱపై
ఎవ్వకు మొదలగు జవ్వన" మెదిరించగా కళావతి మేన నెసగెనట!

తన యౌవనోదయమే కన్నతండ్రికి మరణ హేతువయ్యెను గదా యన్న చింతచే కళావతి 'పాపపు జవ్వన' మేతెంచెనని తన జవ్వనము నిందించుట స్త్రీ స్వభావోచితముగ, లోకానుభవ ప్రసిద్ధముగనున్నది. ఇట్టి యెడ దేవాపి యను గంధర్వు (మూలమున దేవాది యని యుండగా పెద్దన 'దేవాపి'గా మార్చెను.) డొకడు సబాంధవుడై పారుని పర్ణశాలకు నత 'డగ్ని కార్యవిరతుండై' యున్న సమయమున సేవపు వేసముతో వచ్చెనట! ఈ సందర్భమున భోగ పరాయణులగు గంధర్వుల రోతబుట్టించు వేసముల వర్ణించిన విధము చిత్రముగ నున్నది.

శిఖిపింఛదళ పరిష్కృతములై చేమంతి
విరుల తీరగు శిరో వేష్టనములు
నెఱగంటి చూడ్కిఁ దాయెతుల దాహూల వంచి
నా రాజ లల్లాప్పు నారణములు
కాదంబరీ గంధ గర్వంబులై వల్పు
మనసారమిక దావ్య గంధములును
దంహోపములఁ గోఁచు తాంబూల సేవాంధ
కారి తాధర రదక్షతుల యొఱపు.

జిటులు గంధంపుఁ బూతలు, జిహ్వాంలకు
వసపు నెఱవాడి బంటు వంతపుఁ బదరులు
ఘనమగు జుగుప్స వెసపు వర్ణనముఁ జూచి
ముని మనంబునఁ గసి నసహ్యించు కొనుచు. (ఆశ్వా. 6. ప. 44)

నెమిలి యీకలు తెక్కిన తెల్లని తలపాగలు, మద్యపానముచే నెఱుపెక్కిన కన్నులు, దండలకుఁ దాయెతులు, చేతులలోఁ గత్తులు, మాటలాడుటకు నోరు దెఱచిన గుప్పుమని కల్లు కంపు, పెదవులయందు దంతక్షతములు, కల్లు కంపును, పంటి నొక్కులను గప్పిపుచ్చుటకు వేయుచున్న పచ్చకర్పూరముతోడి పుక్కిటి విడెములు, వానిపై బంటుతనపు ప్రతాపములతో వచ్చిరట! ఈ గంధర్వుల తలపాగలను, తాయెతులను తొలగించి చూచిన మన కంటికి 'మృచ్ఛకటిక'లోని రాజశ్యాలకుఁడు శకారుడు ప్రత్యక్షము కాగలఁడని తలఁతును. వేష భాషలందేకాక గుణగణములు వర్ణనే. పెద్దన కాలములో నిట్టి విలాస పురుషులగు విటులుండెరి వారేమో! చూచినట్లు వర్ణించినాఁడు. ఇట్టి వేషములతో వాఁడు డగ్ని కార్యవిరతుఁడై యున్న సమయమున వచ్చి యతనితోడి వియ్యమును గోరిరి. ఇఁక మునికి కోపమురాక మరే మగును? భోగలాలసులైన వీరి వేషములే మునికి రోతబుట్టించినవి. కాని శుచియై యగ్ని కార్యవిరతిలో నుండగా వచ్చి బాంధవ్యము నపేక్షించుట కోప హేతువయ్యెను. అంత నతఁడు ముందుగా ;

'అహా! ధన్యుఁడనైతి మద్విమల వంశాచార విద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలించెన్, నాగవాసంబు మ
ద్గేహక్షోణికి బిడ్డ వేఁడుటకు నేతేఁ గాంచుటన్.'

అని యొక వ్యాజస్తుతిని విసరి కోపము బట్టలేక

'బ్రాహ్మణ్యమిం
కోహో! వాలు, పాకాలిపోయెడలా పోరో నోటి క్రొవ్వేటికిన్?'

అని కసరికొట్టి.

'మీ తరమువార లేరటే, నేతరి తనమునఁ దపస్విగృహ కన్యకలన్
వీత భయవృత్తి వేఁడిరొకో, తము దర్శింప కౌర! క్రొవ్వులబంచున్.'

ముక్కుమూసిన్ని పసరము క్రియఁగెరలి తిట్టగా వారు సురుమని వెడలిపోయిరట! 'ముసలి గదా పుట్టినిల్లు మత్సరోష్టితకున్' అని చెప్పి పారువి కోపమునకు ముసలితనము గూడ నొకకారణమని చెప్పెను. విఫల మనోరథుడైన దేవాపి పగవాటిపోయి, యానాటి యర్ధరాత్రి నిద్రించు పారువి మెడ కరాచూరితో గోసి దొంగవలెఁ బారిపోయెనట.

ఈ విధమున మూలమునందు లేని కోప కారణమును పారు డగ్ని కార్యాసక్తుడయి యున్న సమయమున సహస్యావేషముతో వచ్చి బిడ్డను వేఁడుట యనియు, దానికితోడు ముసలితనము తోడయ్యెననియు స్పష్టపఱచెను. గంధర్వుఁడు 'మత్తకరి' విధమునఁ జనుదెంచి పారువి వధించెనని మూలన వ్రాయగా దేవాపి యర్ధరాత్రివేళ దొంగవలె వర్షశాలఁ జొచ్చి వంచనచే మెడగోసి పాఱిపోయినట్లు పెద్దన కల్పించి, "అట్ల యగుగాక పుడమిఁ గామాంధచిత్తు లెవ్వరి వధింప రెటుసేయఁ దేమిగాదు" అను వర్థాంతర న్యాసముచేత దానిని సమర్థించెను. ఈ యర్థాంతర న్యాసమువలన కామాంధుఁడైన గంధర్వుఁడు మాయా ప్రవర వేషమును ధరించి వరూధిని కసుగస్పి తన కామమును దీర్చికొని, నిజమెఱిఁగిన శపించునను భయమున నసత్యములు పలికి నచ్చజెప్పి తప్పించుకొని పోయిన విషయమును పెద్దన యిట పాఠకులకు జ్ఞాపకముచేసి, కామాంధచిత్తుడే యగు నీ దేవాపి యను గంధర్వుఁడును బగ దీర్చుకొనుటకు దొంగవలె నర్ధరాత్రి యిలు సొచ్చి నిదురించు మూడుగాళ్ళ ముదివగ్గు మెడ గోసి పాఱిపోయినట్లు కల్పించి, యీ గంధర్వులిరువురు నొక తెగకుఁ జెందినవారే యనుట స్పష్ట మొనరించెను. తండ్రి మరణానంతరము కళావతి మరణోద్యుక్తురాలగుట, తంబురాజే యామెను వారించి నీకు స్వరోచి భర్తకాఁగలఁడు, అతని కొడుకు మనువగునని తెలిపి పద్మిని యను విద్య ప్రసాదించి పోయెనను విషయము మూలములోనున్న విధముననే మనుచరిత్ర మందును గలదు.



కవిత:

# తపన

శ్రీ వంగల పార్థసారథి ఆచార్యా

హృదయ గుహాంతరాళము పెకిల్లిన బ్రద్దలుచేయు నిస్పృహల్
మదమున ఘీంకరించి నను మార్కొను నొంటరివే: యేల నా
యెదురుగ నిల్చి పిల్చి మురిపింతువు? నీ మధురానురాగపుం
బెదవుల నవ్వుతో వెలుఁగువెట్టి ఇటుల్ వలపింతు వీనిశన్.

నీవలెనే సుధాంబుధుల నేనును దోఁగితి - నూగిపోతి నే
నీవలె భావనాపగల నిర్మల దోలల దేలి సోలి - నే
నీవలె బాడినాడ నవనిన్ నవనందనసీమ యందు - నా
భావము లన్నియున్ మఱుగుపడ్డవి! పడ్డ నితాంత యాతనన్.

ఎవరని నం దలంచెదవొ యేమొ! కళావిరహాతిరేక సం
భవ పరితాప నిర్గళిత బాష్ప తరంగిత భావగీతికా
శి వినుచు శక్తి గోలుపడి ప్రేమరసార్ద్రి మనస్సమాధిలో
గవినొ తపస్వినో యెఱుక గల్గని నాదురవస్థ చూచినన్!

ఈ యెదలోన నెన్ని కుసుమించెనొ మున్ను గులాబి మొగ్గ! లీ
చేయి సృజించుకొన్నది విశిష్ట విచిత్ర కళాజగత్తు - లే
మాయెనొ? కాలగర్భ లయమైన విషాద కథావిధానమై
మోయఁగలేవి వీని బరువుల్ స్మృతి మాత్రములై కలంచగన్!

ఎన్ని ముసిముసి నవ్వుల యేళ్ళు సాగి
సాగరస్వామి దివ్యహస్తముల బొంగు
లోన గ్రీష్మాతపమ్ముల గ్రుంగలేదు?
ఎన్ని జీవన శోభ లిట్టింకలేదు?

మున్నిచటి మహా పర్వతమ్మున గళా వి
దగ్ధ యువ శిల్పి యెవరొ చిత్ర ప్రపంచ

మును సృజించి జీవమువోసి పొంగిపోయి
నాడు! నేటి శైథిల్యపు గోడెఱుగక!

కమలినీ విరహిణి యస్తగత హృదీశు
ధ్యానమున నిల్చె గనులు మూతవడి వికల!
నుత్పలిని పవలెల్ల విధూదయ ప్ర
తీక్ష నిట్టూర్చి బాష్పమ్ము లింక నేడ్చె!

ఆనందానుభవమ్ములో బ్రబల దుఃఖాక్రోశముల్, సుందరో
ద్యానాలన్ శిశిరర్తు శీతల మరుత్సంఘర్షణోద్ధూత వ
ల్లీ నైరాశ్యము లీనమై తపన ప్రేరేపించు నా గుండెలో
నీ నీదర్శనమైన తృప్తిని బ్రసాదింపంగ లేదీస్థితిన్.

ఇట్టి తపన నాలో రగిలించి తిగిచి
తుదకు నీదారి నీవు పోదువా - మతేమొ ?
గుండె పిగిలించు క్షోభతో గుమిలి కుమిలి
కొండవాగై ద్రవించి నేనెండిపోనా ?

— "ఎడారి పూలు" నుండి.

---

వ్యాసము:

# విశ్వవిద్యాలయములు - ప్రభుత్వము

శ్రీ మోటూరి సత్యనారాయణ

మహమ్మదీయుల పరిపాలనలోనుండి విడివడి భారతదేశం ఇంగ్లీషువారి పరిపాలనలోనికి వచ్చిన తరువాత ఇంగ్లీషువారు ఇంగ్లీషు భాషను దేశమంతటా వ్యాపింప జేసి భారతీయులను పాశ్చాత్య నాగరికతాభిమానులనుగా తయారుచేశారు. 1835 సంవత్సరంలో మెకాలే సలహాల ననుసరించి లార్డ్ విలియం బెంటింక్ దొర ఒక నిర్ణయం చేశాడు.

(1) భారతీయులలో పాశ్చాత్య వాఙ్మయాన్నీ, విజ్ఞానాన్నీ వ్యాపింపజేయడానికి ఇంగ్లీషుభాషను వ్యాప్తం చేయాలి. అందుకు అవసరమైన డబ్బును ప్రభుత్వం ఖర్చు పెట్టాలి.

(2) ప్రాచ్య విద్యా శిక్షణాలయాలను మూసివేయక పోయినా వాటికి ఏ విధమయిన ఆర్థిక సహాయాన్ని చేయగూడదు.

(3) ప్రాచ్య సాహిత్య ప్రకాశనార్థం ప్రభుత్వ ధనాన్ని వినియోగించ కూడదు.

(4) ప్రభుత్వ పక్షాన విద్యావ్యాప్తికి ఖర్చు పెట్టదలచుకొన్న ధనాన్ని ఇంగ్లీషు వ్యాప్తికి మాత్రమే ఉపయోగించ వలెను.

ఈ నాలుగు అంశాలతో కూడిన బెంటింక్ దొర నిర్ణయాన్ని ఆరోజుల్లో హిందువులు బాగున్నదని శిరసా వహించారు. కాని, ఉత్తరదేశంలోని మహమ్మదీయులు అందుకు వ్యతిరేకించారు. అంతవరకు ఉత్తరదేశంలో రాజ్యాంగ వ్యవహారాలు ఉర్దూ లేక పార్సీ భాషలలో జరుగుతూ ఉండేవి. ఉర్దూ, పార్సీలకుగల ప్రాముఖ్యతను తగ్గించివేస్తే తద్వారా మహమ్మదీయుల ప్రాబల్యం తగ్గిపోగలదని మహమ్మదీయులు భయపడ్డారు. అందువల్లనే హిందువులు సంతోషించారు. ఇంగ్లీషు వ్యాపించటం వలన భారతదేశంలో క్రీస్తుమతం విస్తృతినంది మహమ్మదీయమతం ఉపేక్షింపబడుతుందనికూడా మహమ్మదీయులు భావించారు. ఈ విషయాన్ని బాగా అర్థం చేసుకున్న ఇంగ్లీషువారు మహమ్మదీయులలో వ్యాపించిన వ్యతిరేకభావాన్ని మొదలంటా తుడిచి వేయడానికి విశ్వప్రయత్నం చేశారు. 1836 వ సంవత్సరంలో హుగ్లీలో మొదటి ఇంగ్లీషు కాలేజీ ప్రారంభించ బడ్డది. ఆనాటినుండి ఈనాటి

వరకూ అవిచ్ఛిన్నంగా ఇంగ్లీషు సాహిత్యమూ, పాశ్చాత్య సంస్కృతీ మన దేశంలో వ్యాపిస్తూనే వస్తున్నవి.

తరువాత నెమ్మది నెమ్మదిగా ఇంగ్లీషు మాధ్యమంలో విద్యా ప్రచారంచేసే సంస్థలుగూడా ప్రారంభమైనవి. ఇంగ్లండులోని విశ్వ విద్యాలయాల ననుకరిస్తూ మన దేశంలోగూడా విశ్వ విద్యాలయాలను స్థాపించడం ప్రారంభమైనది. 1857లో కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో విశ్వ విద్యాలయాలు ప్రారంభింపబడ్డవి. ఈ విశ్వవిద్యాలయాలద్వారా ఇంగ్లీషు భాష దేశం నలుమూలలా వ్యాపించడం ఆరంభించింది. 1887 లో అలహాబాదులోనూ, 1916 లో హిందూ విశ్వవిద్యాలయం బెనారసులోనూ స్థాపించ బడ్డవి. ఇప్పటికి మన దేశంలో మొత్తం 26 వరకు విశ్వ విద్యాలయాల సంఖ్య పెరిగినది. దేశంలోని విభిన్న భాషాప్రాంతాలు ప్రాతిపదికగా ఈ విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డవి. విశ్వ విద్యాలయాలు మన దేశ చరిత్రలో అంకితం చేసిన 120 సంవత్సరాల అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని వాటిని మార్చడం ఎలాగు అనేది మనముందు ఒక సమస్యగా ఈనాడు తయారయినది. మన భాష, మన చరిత్ర, మన సంస్కృతి మొదలగు రంగాలలో విశ్వ విద్యాలయాలు ఏ విధమైన పాత్రను వహించినవో మన యీ 120 సంవత్సరాల అనుభవం చెప్పుతూనే ఉన్నది. భారతీయ సంస్కృతి పునాదులే పెకలింపబడి మన నాయకుల మనః ఫలకాలపై కొత్త చిత్రాలు చిత్రించ బడ్డవి. మహాత్మా గాంధీజీ జన్మించి మహావిప్లవాన్ని నడిపించి ఉండకపోతే మనం ఎంతటి అధోగతి పాలయ్యేవారమో ఈనాడు ఊహించడంగూడా కష్టమనిపిస్తున్నది.

మహాత్మాజీ ఇంగ్లీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడపిన సహాయనిరాకరణోద్యమంలో మూడు విషయాలు ముఖ్యంగా ఉండేవి. ఇంగ్లీషు పాఠశాలలను బహిష్కరించడం ఆ మూడింటిలో ముఖ్యాతి ముఖ్యమైనది. గాంధీజీ ఆదేశం రాగానే వేలకొలదిమంది విద్యార్థులు ఇంగ్లీషు పాఠశాలలను వదలివేశారు. అటువంటి విద్యార్థులకుగాను దేశమందు జాతీయ పాఠశాలలు నెలకొల్ప బడ్డవి. వాటిలో కొన్ని ఇప్పటికిగూడా బాగా పనిచేస్తూ ఉన్నవి. ఏమైనా ఆ పాఠశాలలు అనుకున్నంతగా అభివృద్ధిని సాధించ లేక పోయినవి. 1937 సంవత్సరంలో గాంధీజీ విద్యారంగంలో ఇంకొక విప్లవాన్ని లేవదీయడానికి ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్న ఫలితంగా వర్ధాలో నయీ తాలీమ్ సంఘం ఏర్పడ్డది. ఈ సంఘం బేసిక్ విద్యా విధానాన్ని దేశంలో వ్యాపింప జేయడానికి ప్రయత్నిస్తున్నది. ఈ విధానాన్ని కేంద్ర

రాష్ట్రప్రభుత్వాలు రెండూ అంగీకరించినవేగాని అందుకుగాను తగినంత శ్రద్ధ వహిస్తున్నట్లు కనపడడం లేదు.

బేసిక్ విద్యా విధానం ద్వారా సామాన్య జనానీకానికి తమతమస్థానాలలో ఉండగానే విద్య లభించవలెననీ, ఈ విద్యార్జన ఫలితంగా మానవుని ఆత్మీయ వికాసంతోబాటు జీవికా నిర్వహణకు ఉపయోగించే వృత్తి విద్య నేర్పబడ వలెననీ గాంధీజీ ఆశించారు. పెద్దపెద్ద యంత్రాలవలన జరిగే "శోషణ" అంత మొందింప బడి పరస్పర సహాయంతో ప్రజలు సామాజిక సంస్కృతిని వికసింప జేసుకొనడం గూడా ఈ విధానం ముఖ్యోద్దేశ్యాలలో ఒకటి. విద్యావేత్తలందరూ ఈ విధానాన్ని అంగీకరించారు. కాని తగినంతగా ఎందువల్లనో సహకరించడం లేదు. దానికి కారణాలు అనేకం కనపడుతున్నవి. అసలు మన శిక్షణ కేంద్రాలన్నీ పట్టణాలలో ఉన్నవి. ప్రభుత్వం వారి శక్తి యావత్తూ పట్టణాలలోని ఈ కేంద్రాలను నడిపించడానికే వ్యయమై పోతున్నది. మాధ్యమిక పాఠశాలలూ, కాలేజీలూ అన్నీ పట్టణాలలో ఉన్నవి. ఉన్నత శిక్షణ కేంద్రాలు విశ్వవిద్యాలయాల ఆధీనంలో ఉండిపని జేస్తున్నవి. విశ్వవిద్యాలయాలు సర్వస్వతంత్రములని పేరు. అవి తమ పురాతన విధానాన్ని వదలి కొత్త విధానాన్ని అవలంబించడానికి సిద్ధంగా లేవని అనుభవం వలన బోధపడుతున్నది. విశ్వవిద్యాలయాలలో లభించే విద్యయే ప్రభుత్వ రంగంలో గానీ, లేక ఇతర రంగాలలోనాని ఉద్యోగం సంపాదించడానికి సాధనంగా ఉండడం వలన విశ్వ విద్యాలయాలు మన జీవిత రంగంలో ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకొని కూర్చున్నవి. ఈ పద్ధతి మారనంతకాలం మన విద్యావిధానంలో మార్పు రావడం అసంభవం. 1835 లోనే మెకాలే "ఇంగ్లీషు పాలకవర్గంవారి భాష అనీ,అది వ్యాపారవర్గంవారి భాషగాగూడా రూపొంది ప్రాచ్య దేశాలలో వ్యాపించ గలదనీ" అన్నాడు. అంతేగాక ఇంగ్లీషు పుస్తకాలతో నిండిన ఒక్క బీరువా అరేబియా, హిందూదేశాల సంపూర్ణసాహిత్యం కంటే ఎక్కువ విలువైనదని అన్నాడు. ఈనాడు మన విశ్వవిద్యాలయాలను నడిపించే శిక్షణ శాస్త్రవేత్తలు గూడా 120 సంవత్సరాలకు పూర్వం మెకాలే చెప్పిన మాటలనే వల్లె వేస్తున్నారు. హిందూదేశం స్వాతంత్ర్యాన్ని సంపా దించు కొన్నదనీ, ప్రజాతాంత్రిక విధానాన్ని అనుసరిస్తున్నదనీ, ఈ శిక్షణ శాస్త్రవేత్తలు అంతగా గమనిస్తున్నట్లు కనపడడం లేదు. ఈనాడు జనసామాన్యం జాగృతమైనది. తమతమ భాషలద్వారా జ్ఞానసముపార్జన చేయడానికి ఉవ్విళ్లూరు తున్నది.

స్వాతంత్ర్యం లభించిన తరువాత మనదేశంలో ప్రభుత్వాల పరంగా ఖర్చయిన డబ్బునుచూస్తే విద్యకుగాను చాలా ఖర్చయినట్లు కనపడుతున్నది. వేరువేరు ప్రాంతాలలో విశ్వవిద్యాలయాల అధీనం క్రింద 1948 లో 427 కాలేజీలుంటే 1953 నాటికి వాటి సంఖ్య 920 వరకు పెరిగింది. కాలేజీలలో చదివే విద్యార్థులసంఖ్య 1948 లో 2, 28, 881 అయితే 1953 లో 4, 65, 794 వరకు పెరిగింది. ఈ కాలేజీల నిర్వహణకు 1948 లో 29, 977, 043 రూపాయలు ఖర్చయితే 1953 లో 211, 620, 693 రూపాయలు ఖర్చయినవి. మాధ్యమిక పాఠశాలలు గూడా స్వాతంత్ర్యం లభించిన తరువాత బాగా పెరిగినవి. 1948 లో వాటిసంఖ్య 12, 889 అయితే 1953 లో 23, 865 వరకు పెరిగింది. మాధ్యమిక పాఠశాలల కొరకయ్యేఖర్చు 139, 169, 822 రూపాయలనుండి, 369, 486, 150 రూపాయల వరకు పెరిగింది. మొత్తంమీద శిక్షణకు గాను మూడురెట్లు ఖర్చు 1948 కంటె 1953 నాటికి పెరిగిందన్నమాట. ఇంత జరిగినా మనదేశంలో నిరక్షరాస్యుల సంఖ్య 87% వరకు ఉన్నది. అంటే ప్రభుత్వం డబ్బు అంతా దేశానికి నిరుపయోగ కరమైనదేగాక హానికరమైనదనిగూడా గాంధీజీచే వక్కాణించబడి, అఖిల భారత కాంగ్రెసుచేత అంగీకరింపబడిన విద్యా విధానానికే ఖర్చవుతున్నది. మన రాజ్యాంగ చట్టంలో నిర్ణయింపబడిన ప్రకారం పది సంవత్సరాలలోపల 14 సంవత్సరాలవరకు వయస్సు కలిగిన యావన్మంది పిల్లలకూ ఉచితంగా నిర్బంధంగా విద్య నేర్పించవలసి ఉన్నది. రాజ్యాంగ చట్టం ఏర్పడి ఇప్పటికి ఐదు సంవత్సరాలు గడచి పోయినవి. ఇంతవరకు రాజ్యాంగ చట్టంలో నిర్ణయించుకొన్నదానిని అమలు పరచడానికి ప్రయత్నమైనా ప్రారంభం కాలేదు. పాఠశాలలు, కాలేజీలు ఇంకా ఇంగ్లీషుకు కోటలుగానే ఉన్నవి. ఈ పరిస్థితిని మార్చి ఇంగ్లీషు భాష ప్రాముఖ్యతను విద్యావిధానంలోనుండి క్రమంగా తగ్గించి అక్షరాస్యత వైపుకు ప్రభుత్వ దృష్టిని మరలిస్తేనేగాని ప్రజలలో విద్యావ్యాప్తి జరుగ నేరదు.

శిక్షణ కేంద్రాలు పట్టణాలలో ఉండడంవలనగూడా వాటికి దూరంగా గ్రామీణ ప్రజలు ఉండిపోతున్నారు. ప్రస్తుతం అమలులో ఉన్న విద్యావిధానం ఖర్చుతో కూడుకొని ఉన్నందువల్లగూడా బీదవారు ఆ వైపుకు చూడలేక పోతున్నారు. కనుక విశ్వవిద్యాలయాలనే పేరుతో ప్రస్తుతం జ్ఞాన గంగకు అడ్డం గట్టబడిన కట్టలను తెగగొట్టి ఆ ప్రవాహం దేశంలో నలుమూలలకూ వ్యాపించేటట్లు చూడాలి. భారతీయ భాషలద్వారా జ్ఞాన వితరణ ప్రారంభమైతేనేగాని ఆ పని జరుగదు. బోధనాభాషగా విదేశీ భాష ఉన్నంతకాలం ప్రజలలో విరివిగా విద్యా ప్రచారం జరగడం అసం

ఖవం. విద్యా ప్రచారానికి భారతీయ భాషలే మాధ్యమంగా ఉండడం ఎంతైనా అవసరం. అయితే ఉన్నత విజ్ఞానాన్ని వ్యక్తం చేయగలిగిన శక్తి దుర్బలములైన మన భారతీయ భాషలకు ఉన్నదా అనేది ఒక ప్రశ్న. ఇంగ్లీషు ప్రభుత్వంవారు వేసిన శీతకన్ను కారణంగా భారతీయ భాషలు బలహీనమైన స్థితిలో ఉన్నమాట వాస్తవమే. ఇదివరలో దినదినం వృద్ధిపొందుతూ ఉన్న విజ్ఞానాన్ని వ్యక్తీకరించే శబ్దజాలాన్ని సృష్టించడానికి ప్రయత్నం జరిగలేదు. ఇంగ్లీషును ఆశ్రయించుకొని కూర్చున్న మన విశ్వవిద్యాలయాలకు అటువంటి ప్రయత్నం చేయవలసిన అవసరం కల్పించలేదు.

ఇక ఇప్పుడు ప్రపంచంలో విజ్ఞాన శాస్త్రానికి ప్రాముఖ్యత పెరిగిపోతున్నది. విశ్వ విద్యాలయాలు ఈ ప్రాముఖ్యతను మరీ ఎక్కువగా గుర్తిస్తున్నవి. వంద సంవత్సరాలకు పూర్వం సంస్కృతి కేంద్రములని పిలవబడిన విశ్వ విద్యాలయాలు సైతం ఈనాడు విజ్ఞానశాస్త్ర కేంద్రాలుగా మారిపోతున్నవి. విజ్ఞానశాస్త్ర కళాశాలల సంఖ్య, ఆ శాస్త్రాన్ని అభ్యసించే విద్యార్థుల సంఖ్య పెరిగి పోతున్నది. సాంఘికాది శాస్త్రాలవైపుకు విద్యార్థుల దృష్టి అంత ఎక్కువగా ప్రస్తుతం ప్రసరించడం లేదు. సంస్కృతికీ సాంఘికాది శాస్త్రాలకూ అవినాభావ సంబంధ ముంటుంది. విజ్ఞానశాస్త్రం పదార్థంవైపుకు పరుగెత్తుతూ ఉంటే సంస్కృతి పరమార్థం వైపుకు పరుగెత్తుతుంటుంది. ఈ పదార్థ పరమార్థాల మధ్య బయలుదేరిన సంఘర్షణలో జ్ఞాన పిపాస గలిగిన మానవజాతి నలిగిపోతున్నది. అంతంలో పరమార్థం జయించి తీరుతుంది. మానవ సంస్కృతికి సంబంధించిన చరిత్ర — ఆర్జించిన జ్ఞానసంపదను సంఘ క్షేమముకొరకు ఉపయోగించని మనుష్యుడు — ఆ జ్ఞాన సంపద బరువు క్రిందనే నలిగి కుంగి పోగలడని — చెప్పుతున్నది. అదే విధంగా విజ్ఞాన శాస్త్రాన్ని మాత్రమే పెంచుకుంటూ పోయిన మానవుడు — ఆ శాస్త్రబలాన్ని ఆధారంగాచేసుకొని పెద్దపెద్ద యంత్రాలను నిర్మించి ఆ యంత్రాల క్రిందనే కూలి పోగలడు. కనుక సంస్కృతి ప్రాముఖ్యానికీ విజ్ఞాన శాస్త్రపు లోతులకూ సమన్వయం కుదరవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. విజ్ఞానశాస్త్రం అందరికీ అందుబాటులోనికి వచ్చినా రాకపోయినా సంస్కృతిశాస్త్రం మాత్రం అందరికీ అందుబాటులోనికి రాకతప్పదు. కనుక మనదేశంలో భౌతిక శాస్త్రాన్నీ సాంఘికాది శాస్త్రాలనూ బోధించడంలో సమన్వయాత్మక దృష్టి ఏర్పడాలి. ప్రతి భారతీయుడూ సాంస్కృతికంగా వికాసాన్ని పొంది భౌతిక శాస్త్రంవలన లభించిన ప్రయోజనాన్ని అనుభవించవలెను. ఈ సమన్వయ సాధన ముఖ్యాతి ముఖ్యమైనది. కనుక విద్యను

జ్ఞానాన్ని సర్వజన సులభం చేయడానికి భారతీయ భాషలు బోధనాభాషలుగా ఏర్ప డడం వాంఛనీయం.

1948 వ సంవత్సరంలో విశ్వవిద్యాలయాల స్థితిగతులను విచారించి నివేది కను సమర్పించడానికి ఒక కమీషన్ ప్రభుత్వం వారిచే ఏర్పర్చ బడింది. 1950 సంవత్సరంలో ఆ కమీషన్ నివేదిక వెలువడింది. ఆ నివేదికలో చాలా ముఖ్యమైన విషయాలు చర్చించ బడ్డవి. ఆ నివేదికలోని రెండు అధ్యాయాలు మరీ ముఖ్య మైనవి. ఒకటి బోధనాభాషకు సంబంధించినదీ, ఇంకొకటి విశ్వ విద్యాలయాల పరీక్షలకు సంబంధించినదీని. మొదటి అధ్యాయంలోని విషయాలు :

(1) భారత దేశమంతటా ఒకరాజభాష వృద్ధిపొందేటట్లు చేయాలి. (ఆ తరువాత ఆభాష హిందీ అని అంగీకరింపబడ్డది.) ఆ భాషలోనుండి హిందూదేశం లోని భిన్న భిన్న ప్రాంతాలనుండి వచ్చినవైనాసరే, లేక బయటనుండి వచ్చినవైనా సరే శబ్దాలను ఏరి తీసివేయ గూడదు. అట్లా తీసివేయడం వలన సమ్మిశ్రిత సంస్కృతి వ్యక్తంగాకుండా ఉండిపోయే ప్రమాదముంటుంది.

(2) అంతర్జాతీయ రంగంలో అమలులోనున్న వైజ్ఞానిక, సాంకేతిక శబ్దా లను ఉన్నవున్నట్లుగా హిందీలోనికి తీసుకొనవలెను. ఆ విధంగా స్వీకరింపబడిన శబ్దాలను భారతీయ భాషాధ్వని శాస్త్రాన్ని అనుసరించి భారతీయ అక్షరమాలలో ఇమిడి ఉండేటట్లు మార్చుకొనవలెను.

(3) ఉన్నత విద్యకు మాధ్యమంగా ఇంగ్లీషుకు బదులు భారతీయ భాషలను ఉపయోగించవలెను. అనేక యిబ్బందుల వలన ఆ భాష సంస్కృతం కానేరదు.

(4) మాధ్యమిక పాఠశాలల్లోనూ, కాలేజీలలోనూ చదివే విద్యార్థులకు మూడు భాషల పరిచయం ఏర్పడవలెను. (1) ప్రాదేశికభాష, (2) హిందీ, (3) ఇంగ్లీషు. ఇంగ్లీషు పుస్తకాలను చదివి అర్థం చేసుకొనేటంతటి యోగ్యత ఇంగ్లీషులో ఉంటే సరిపోతుంది.

ఉన్నత విద్యకు ప్రాదేశిక భాష మాధ్యమంగా ఉండవలెను. ఎవరైనా విద్యార్థి తనకోరికపై రాజభాష హిందీని మాధ్యమంగా తీసుకొనదలిస్తే తీసుకొన వచ్చును. అన్ని విషయాలకూ లేక కొన్ని విషయాలకూ మాధ్యమంగా విద్యార్థి హిందీని స్వీకరించవచ్చును.

(5) రాజభాష లిపి దేవనాగరి. ఆ దేవనాగరిని దోషరహితంగా సంస్క రించ వలెను.

(6) ప్రాదేశిక భాషలనూ, రాజభాషనూ వృద్ధి పొందించుటకు తొందరగా ప్రయత్నించవలెను.

భారతీయ భాషలన్నింటిలోను లభించెడి వైజ్ఞానిక శబ్దాలను పోగుచేసి భిన్న భిన్నమైన వైజ్ఞానిక శాస్త్ర పాఠ్య గ్రంథాలను తయారు చేయడానికి తొందరలో ఒక బోర్డును స్థాపించవలెను. ఆ పాఠ్య గ్రంథాలను ప్రాదేశిక భాషలలోనికి అనువదించడానికి వీలుండాలి.

మాధ్యమిక పాఠశాలల్లోనూ, కాలేజీలలోనూ, రాజభాషను నేర్పించవలసినదిగా రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించ వలెను.

(7) ఇంగ్లీషును మాధ్యమిక పాఠశాలల్లోనూ, విశ్వ విద్యాలయాలలోనూ నేర్పించే ఏర్పాటు చేయవలెను. అందువలన ప్రతిదినం విశ్వరంగంలో వ్యాప్తమవుతున్న జ్ఞానసంపదతో విద్యార్థులకు పరిచయం ఏర్పడుతుంది.

ఈ విషయాలన్నీ శిక్షణరంగంలో ముఖ్యమైనవేగాక, క్రమబద్ధమైన భారతీయ విద్యా విధానంయొక్క అభివృద్ధికిగూడా చాలా అవసరమైనవి.

ఇంతవరకు ప్రభుత్వం వారికి గుమాస్తాలను తయారుచేసే లక్ష్యంతో విశ్వ విద్యాలయాలు పనిచేసినవి. విశ్వ విద్యాలయాలలో చదివే విద్యార్థులుగూడా అదే విధంగా తయారైనారు. లేనినాడు మన దేశంలో ఇంతమంది నిరుద్యోగులు ఉండి, వారికొరకై కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్ట వలసిన పరిస్థితి ఏర్పడేది కాదు. ఎన్ని ప్రయత్నాలు చేసినా విశ్వవిద్యాలయాలలో నుండి తయారయి బయటకు వస్తున్న నవయువకులకు ఏ ప్రభుత్వమూ ఉద్యోగాలు యివ్వలేదు. ఉద్యోగాలు యివ్వలేము గనుక విద్యాలయాలను మూసివేస్తామని గూడా ప్రభుత్వం చెప్పలేదు. కనుక విద్యా విధాన స్వరూపం మారడం అవసరం. విశ్వవిద్యాలయాలు అమూలాగ్రంగా మార్పుచెంది నిజమైన సాంస్కృతిక కేంద్రాలుగా రూపొందవలెను. జన సామాన్యంమాట్లాడే భాషలు మాధ్యమంగా ఏర్పడవలెను. అవసరమైతే భౌతిక జ్ఞానాన్ని అభ్యసించడానికి కొంతకాలం ఇంగ్లీషు ఉంటే ఉండవచ్చును. ప్రభుత్వం నేర్పించే విద్య జీవికకొరకై స్నాతకులను ఇల్లిల్లు తిప్పేదిగా ఉండగూడదు. విప్లవాత్మకంగా ఆలోచించే వ్యక్తులు పూనుకొంటేనేగాని ఈ పని అంతా సక్రమంగా జరుగదు.



వ్యాసము :

# కన్నడ సాహిత్యము - పూర్వ మధ్యయుగము

శ్రీ హెచ్. జె. ఉపాధ్యాయ, ఎం. ఏ.

కన్నడ సాహిత్యంలో పూర్వమధ్యయుగము చాలా ప్రధానమైనది. ఈయుగములో శైవ, వీరశైవ, వైష్ణవ సాంప్రదాయాలకు సంబంధించిన కవులు కన్నడ సాహిత్యానికి సర్వాంగ సంపూర్ణోన్నతిని సమకూర్చగా ఇతర రచయితలు వివిధ శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలను వ్రాసి కన్నడ వాఙ్మయాభివృద్ధికి తోడ్పడ్డారు. ఇందువల్లనే కన్నడ భాషలో జ్యోతిష, కామశాస్త్ర, అశ్వ-వైద్య, గోవైద్య, వ్యాకరణ, అలంకార గణితాది శాస్త్రగ్రంథాలు ఈ యుగంలో ఎక్కువగా సృష్టింపబడ్డవి. మత ప్రచారమే ఈ యుగ సాహిత్యంలో ప్రాధాన్యత వహించిన సాహిత్యకారులను గూడ మనము ఎక్కువగా చూడగలుగు తున్నాము. ఈ యుగంనాటి మత ప్రాబల్యం, సాంఘిక పరిస్థితుల ప్రభావం సాహిత్యంమీద హత్తుకొనడమే కారణము. 12 వ శతాబ్దంలో కర్ణాటక దేశంలో, సాంఘిక, మతవ్యవహారాలలో గొప్ప విప్లవం ప్రారంభమైనది. లింగాయతు మత ప్రవర్తకుడు, స్థాపకుడు అయిన బసవణ్ణ ఈవిప్లవానికి నాయకుడు. ఈయన అవైదికమైన జైనమతానికి, వైదికులైన సనాతన మతాలకూ వ్యతిరేకంగా విప్లవాన్ని ప్రారంభించాడు. అతడు సంఘంలోని వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసివేశాడు. అందువల్ల ప్రజలలో మత సంబంధమైన జాగృతి కలిగింది. ప్రజలే ఆ విప్లవానికి ఎక్కువగా తోడ్పడ్డారు. ప్రజలు ఆధ్యాత్మిక చింతనపట్ల శ్రద్ధ చూపసాగారు. ఆధ్యాత్మిక జ్ఞాన జిజ్ఞాసువులలో జాతిమత భేదాలూ, స్త్రీ పురుష భేదాలూ సమసిపోయినవి. దీనిపరిణామంగా ఆధ్యాత్మిక సంఘాలు ఏర్పడి ఆత్మజ్ఞాన ప్రచారం ప్రారంభమైనది. అందుచేత ఈ యుగాన్ని కన్నడ సాహిత్యంలోని ఆధ్యాత్మిక యుగం అని అనవచ్చును.

12 వ శతాబ్దంలో కన్నడ సాహిత్య వాహిని కొత్త ప్రవాహంలో ప్రవహించ సాగింది. అంతకు పూర్వపు కవులు ఎక్కువగా సాహిత్యంవైపు మొగ్గినా ఉండేవారు. సంస్కృత సాహిత్యాన్ని సంగ్రహించడమే వారి ముఖ్యోద్దేశ్యంగా ఉండేది. సంస్కృత సాహిత్యంలోని మహాకవులను అనుకరించడములో వీరికి ఎక్కువగా ఆనందం కనుపించేది. వీరు సంస్కృత ఛందస్సుల వ్యామోహంలోపడి చంపూ కావ్యాలు వ్రాయడంద్వారా కన్నడ భాషను సంస్కృత పద భూయిష్ఠంచేసివేశారు. ఆయుగంలోనే అనగా 11 వ శతాబ్దంలో దుర్గసింహుడనేవాడు కన్నడ రచనలో సంస్కృతశబ్ద ప్రయోగాన్ని వ్యతిరేకించాడు. నయసేనుడు కూడ అనవసరముగ తమరచనలలో సంస్కృత శబ్దాలను నింపే కవులను తీవ్రంగా వ్యతిరేకించాడు. నయసేను డిలా వ్రాశాడు:- "సక్కదమం పేళ్వొడె నేరె, సక్కదమం పేళ్గె శుద్ధ కన్నడదోళ్ తం. దిక్కువుదే సక్కదంగళ్, తక్కుదె బెరసల్కె ఘృతముమం తైలముమం" సంస్కృత పదాలను ఉపయోగించదలిస్తే కవి తన కృతులన్నీ సంస్కృతంలోనే వ్రాయాలి. శుద్ధ కన్నడంలో సంస్కృత శబ్దాలను కలపడం అనుచితం. ఘృతంలో నూనె కలపటం మంచిదా

"హాసకన్నడదిం వ్యావర్ణిసువే సత్కృతియనేందు కన్నడమం చిం
తిసికూడలారదక్కట మిసుకద సక్కదమనిక్కువవనుం కవియే"

కన్నడభాషలో కావ్యాలన్నియు రచించగోరి ఆ భాషలో సంస్కృత పదాల్ని అనవసరంగా వింపే కవి సరైన కవేనా ?

బసవణ్ణ జరిపిన మత విప్లవ ప్రభావ ఫలితంగా కన్నడ సాహిత్యం సంస్కృత ప్రభావంనుంచి విముక్తిని పొందింది. ఆయన తన సాంప్రదాయాన్ని శుద్ధ కన్నడ భాషలో ప్రచారం చేశాడు. సరిగా ఆసమయంలోనే కన్నడ సాహిత్యంలో స్వతంత్ర యుగం గూడా ప్రారంభమైనది. ఈ స్వతంత్రయుగ సాహిత్యంలో గద్య, వచన సాహిత్యములు ప్రారంభమై అవి వికాసాన్ని పొందినవి. పూర్వులు చంపూ కావ్యాల్లోని గద్యాన్ని వచనం అనేవారు. బసవేశ్వరుడు చక్కగా వచనాన్ని వ్రాసి చంపూకావ్యాల్లోని సొంపును, వచన రచనలను తీసుకొని వచ్చి కన్నడ సాహిత్యంలో వచన రచనకు ప్రముఖ స్థానాన్ని కల్పించాడు. బసవేశ్వరునికి పూర్వం దేవరదాసిమయ్య (1040), సకలేశమాదరస (1150) గణదాసి వీరణ్ణ మొదలైన వచనకారులు వచన సాహిత్యాన్ని సృష్టించారు. కాని ఆవచనాలకు సాహిత్యంలో ఉచిత స్థానం లభించ లేదు. బసవేశ్వరుడు వేదము, ఉపనిషత్తులకు సారభూతమైన బ్రహ్మజ్ఞాన ప్రచారానికి వచనాన్ని సాధనంగా ఉపయోగించాడు. వచనకారులలో బసవేశ్వరుడు, చెన్నబసవేశ్వరుడు, కలిదు బసవుడు, అల్లమ ప్రభువు, మహాదేవియక్క, శివశరణులు ప్రసిద్ధులు.

బసవేశ్వరుడు (సుమారు 1160) :- ఈయన వీరశైవ కవి. షట్స్థల వచనము, శివభారత వచనము, కాలజ్ఞాన వచనము మొదలైన గ్రంథములు వ్రాసినాడు. కర్నాటకంలో ప్రసిద్ధ పట్టణమైన ఇంగళేశ్వర బాగేవాడిలో ఈయన జన్మించాడు. ఈయన తండ్రిపేరు మండిగె మాదిరాజు. తల్లి పేరు మాదాంబిక. బిజ్జలరాజు ప్రధాన మంత్రి కుమార్తెయైన గంగాంబికను ఈయన పెండ్లాడినాడు. మామగారైన బలదేవుని మరణానంతరం తానే బిజ్జలరాజుకు మంత్రి అయినాడు. ఈయన తన అధికారబలంవల్ల వీరశైవ మతాన్ని బాగా వ్యాపింపజేసి తన అనుయాయులకు చాలా సహాయం చేసినాడు. వీరశైవ గ్రంథాల్లో బసవేశ్వరుణ్ణి నందీశ్వరావతారమని వర్ణించారు. ఈయన తన వచనాలన్నింటిని కూడలి సంగమదేవునికి అంకితం చేశాడు.

బసవేశ్వరునికంటె సుమారు నూరు సంవత్సరాలకు పూర్వమే వచన సాహిత్యం ప్రారంభమైనది. కాని ఎక్కువ ప్రాబల్యాన్ని గడించలేకపోయింది. బసవణ్ణ తన ప్రతిభవల్ల వచన సాహిత్యానికి ప్రాబల్యం కలిగించి సాహిత్యంలో దానికి ప్రముఖస్థానాన్ని చేకూర్చాడు. అప్పుడు ప్రచారంలోవున్న మహాకావ్య పరంపరను వదలి అతడు తన రచనలన్నీ వచనరూపంలో వ్రాసి తాను స్థాపించిన అనుభవ మంటపాలలో గోష్ఠుల ద్వారా వచన సాహిత్య ప్రచారం చేశాడు. మహారాష్ట్రంలోని అభంగకారులు, హిందీలో సంత్ కవులు తమ దేశభాషల్లో తమ మత ప్రచారం చేసినట్లే బసవణ్ణ శుద్ధ కన్నడ భాషలో తన మత ప్రచారం

చేశాడు. అభంగకారులు, సంత్ కవులు భక్తి జ్ఞాన వైరాగ్య మోక్ష సాధనాలను అభివర్ణిస్తే బస వణ్ణ భక్తికే అధిక ప్రాధాన్యత ఇచ్చారు. ఆయన

"నాదప్రియనూ అల్ల
వేదప్రియనూ అల్ల
భక్తిప్రియ నంభ కూడల" అన్నాడు.

శివ కూడల సంగమ దేవుడు నాదప్రియుడు కాడు. వేదప్రియుడు కాడు. కేవలం భక్తి ప్రియుడు. ఈయన తన దర్శన శాస్త్రంలో గురువు, శివభక్తుడు ఈ ఇద్దరికీ ప్రాధాన్యత ఇచ్చాడు. జ్ఞాన మాహాత్మ్యమును గూర్చి ఆయన ఇట్లు వ్రాశాడు:- "అరిదరే శరణను మరెదరే మానవ." జ్ఞానోదయంవల్ల మానవుడు యోగిగా మారతాడు. జ్ఞానోదయం కానప్పుడు మానవుడు మానవుడుగానే వుండిపోతాడు.

"నేలనొందే హోలగేరి శివాలయక్కె జలవొందే శౌచాచమనక్కె కులవొందే తన్నతానరి దవంగే ఫలవొందే షడ్దర్శనముక్తిగే"- మాలపల్లి, శివాలయము, ఒకే భూతలముపైన వున్నవి. శౌచాచమనముల కుపయోగించే జలము కూడా ఒక్కటే. జ్ఞానం కులములు షడ్దర్శనముల ఫలములు కూడ ఒక్కటే గదా! బసవన్న తత్త్వ రహస్యాలు ఈయనవచనల్లో పలుచోట్ల గోచరిస్తుంటవి.

"దేవనొబ్బనా మహలంవు పలమపతివ్రతే గెన్ను గండనొబ్బ మత్తొందక్కెఎరగిదరే కివి మూగకోయను. హలవు దైవద యంజలంబవరేనేద కూడల సంగమ దేవ"- భగవంతు డొక్కడే కాని పేర్లు చాలా ఉన్నవి. పరమ పతివ్రతయైన స్త్రీకి ఒకే ఒక పతివుంటాడు. అన్యజనాసక్తయయినప్పుడు పతి ఆ స్త్రీ ముక్కు చెవులు కోసివేస్తాడు. అనేకమంది భగవంతులను స్మరించినవాడ నేమనవలె? 'ఈ ఉక్తి' "ఏకం సద్విప్రా బహుధా వదంతి" అనే సూక్తిని జ్ఞాపకం చేస్తున్నది. బుద్ధభగవానుని దయాసందేశాన్ని బసవణ్ణ తన ఉక్తులతో పునరుజ్జీవింప చేశాడు.

"దయే యిల్లద ధర్మవదావు దయ్యా. దయేయే బేకు సకల ప్రాణిగళల్లి దయేయే ధర్మద మూలవయ్యా కూడల సంగమ దేవ"- ప్రపంచమున దయా విహీనమైన మతమేది? ఎల్ల ప్రాణులపట్ల దయకల్గి ఉండవలెను. దయయే మతమునకు మూలము. క్రీస్తు, గాంధీజీల సర్వమత గ్రాహ్యాలైన సందేశాలు ఈ క్రిందివాక్యాల్లో చూడవచ్చును. "కళబేడ, కొలబేడ, హుసియనుడియల బేడ, అన్యంగే అసహ్యపడ బేడ, తన్నబణ్ణిసబేడ. ఇదే అంతరంగ శుద్ధి. ఇదే బహిరంగ శుద్ధి. ఇదే నమ్మకూడల సంగమదేవ నొలిసువపరి"- దొంగతనము చేయకు, హింసమానుము, అసత్యమాడకు, కోపాన్ని వర్జించు, ఇతరులను చూచి అస హ్యించుకొనకు, ఆత్మస్తుతి పనికిరాదు. ఎవరినీ నిందించకు. కూడల సంగమ దేవుని ప్రీతి పాత్రుడుకావడాని కిదే మార్గము.

తరచు అన్నివచనాల్లోనూ ఈయన ఆధ్యాత్మిక సాధనలోని గొప్పతనం గోచరిస్తూ ఉంటుంది. అట్టి వచనాలు రెండు మూడు క్రింద పొందుపరుస్తున్నాము. "ఈశ్వర శివాలయ

దర్శనమైనపుడు మోక్షం లభిస్తుంది. ఈయన తన ఉక్తులలో నీతి ఉపదేశాలు వ్రాసినప్పటికీ అనుష్ఠానానికి అధిక ప్రాధాన్యత నిచ్చారు.

"దేవలోక మర్త్యలోక వేందుడు బెరిల్ల క్రాడిరో సత్యవనుడివుదే దేవలోక, మిథ్యవ నుడివుదే మర్త్యలోక ఆచారవేసర్గ, అనాచారవే నరక కూడల సంగమదేవ నీవే ప్రమాణి."

దేవలోకము, మృత్యులోకము వేరు వేరుగా లేవు. సత్యము పలుకుటే దేవలోకము. అసత్యమాడుటే మృత్యులోకము, సదాచారమే స్వర్గము. దురాచారమే నరకము. కూడల సంగమ దేవా! నీవే దీనికి తార్కాణము.

మహాదేవి యక్క(సుమారు *1160*) :—

ఈమె వీరశైవ శివయుత్రి. ఈమె దక్షిణదేశంలోని ఉడుతడి అనే గ్రామంలో జన్మించింది. చామరసుని ప్రభులింగ లీల అనే తన కావ్యంలో ఈమె జీవితాన్నిగూర్చి కొన్ని విషయాలు వ్రాశాడు. ఈమె తల్లిపేరు విమల, తండ్రిపేరు సుమతి. ఈమె గ్రామానికి రాజైన కౌశికుడు మహాదేవి యక్కను చూచి మోహించి ఆమెను వివాహమాడ దలచాడు. మహాదేవి యక్క కౌశికుణ్ణి వీరశైవ మత మవలంబించమని కోరింది. కౌశికుడు ఆమె కోరికను నిరాకరించగా ఆమె వివాహమాడుటకు నిరాకరించి జీవితాంతము వరకును బ్రహ్మచారిణిగా ఉండి పోయింది. ఆ తర్వాత ఆమె కల్యాణ్ అనే క్షేత్రానికి వెళ్ళిపోయి బసవేశ్వరుని అనుభవ మంటపంలో తన వచనాలద్వారా వీరశైవమత ప్రచారం చేయసాగింది. ఈమె వచనాలు సొంపైనవిగాను, భావగర్భితాలుగాను ఉంటాయి. అరవై 60 వచనాలు, దణ్ణాయకుల 20 వచనాలు, ప్రభుదేవుని 10 వచనాలు, అజగణ్ణ 5 వచనాలు, మహాదేవియక్కవచనాల్లో ఒక్కవచనానికి సమానము. ఈమె తన అంత్యకాలము శ్రీశైలంలో తన ఇష్టదేవత అయిన మల్లికార్జున ఉపాసనలో గడిపింది. అక్కడే కదళీవనంలో శివైక్యాన్ని పొందింది.

ఈమె వచనాలు కొన్ని క్రింద పొందుపరుస్తాను.

"బెట్టద మేలొందు మనెయమాడి మృగగళిగంజిదొడే ఎంతయ్యా? సముద్రద తడియల్లొందు మనెయమాడి నొరెతెరె గళిగంజిదొడే ఎంతయ్యా? సంతెయలొందు మనెయమాడి శబ్దక్కెనాచిదొడే ఎంతయ్యా? చెన్న మల్లికార్జున, దేవకేళయ్యా లోకదల్లి హుట్టిదబళిక స్తుతి నిందెగళు బందరే శరణము మనదల్లి కోపవతాళదే సమాధాని యాగిరబేకు" - పర్వతం మీద నివాసం ఏర్పాటుచేసుకొని సింహాలకు, పులులకు భయపడుటేల? సముద్ర తటంలో నివాసం ఏర్పాటుచేసుకొని తుంగ కెరటాలకు భయపడుటేల? సంతబజారులో నివాస మేర్పాటుచేసుకొని ధ్వనికి సిగ్గుపడుటేల? చెన్న మల్లికార్జున దేవా! వినుము. ప్రపంచంలో జన్మించిన తరువాత స్తుతి, నిందలు జరుగుతూనే ఉంటాయి. కాని భక్తులు ఈ నిందాస్తుతులను చూచి దిగులు చెందక శాంతంగా ఉండాలి.

"మంగళవే మజ్జనవేనగే, విభూతియే ఓకళి గుందదరిసినవేనకొ, దిగంబరవే దివ్యాంబర వేనగే, శివపాద రేణువే అనువేపనలేనగే, రుద్రాక్షియేమై దొడిగె ఎనిగె, శరణర పాదాంగళే తొండిల జావిగ వేనగే చెన్నమల్లికార్జుననగే మదువళిగే, ఎనగేబేరే శృంగారవేకే హేళ

రత్నా" మాంగల్యమే నాకు మజ్జనము. - భస్మమే నాకు సుందరమైన వసువు. దిశలే నాకు దివ్యవస్త్రాలు. శివపాదధూళి నా అనులేపనము. రుద్రాక్షలు నాకు ఆభరణాలు. చెన్నమల్లికార్జునుడే నాపతి. నేను చెన్న మల్లికార్జునుని వధువును. నాకు ఇతర అలంకారాలతో ఏమిపని ?

చెన్నదేవ, చెన్నబసవ మొదలయిన వచనకారులుకూడ చాల ప్రసిద్ధులు. వీరి వచనాలన్నీ భక్తిరసంతో నిండి ఉంటాయి. వీనిలో శుష్కతర్క వాదం మచ్చుకుకూడా లభించదు. భక్తి హృదయంతో నిండిన వీరి వచనాలు సాహిత్య సౌందర్యాన్ని ఇనుమడింప జేసినవి. చిన్న చిన్న వాక్యాల్లో విపులమైన అర్థాన్ని కల్గి ఉండడమే ఈ వచనాల్లో ఉన్న విశిష్ట గుణము. కావ్యం కవి దర్శించే దివ్య దర్శనానుభూతికి వాణి- అనే ఉక్తికి వీరి వచనసాహిత్యమే నిదర్శనము. చెన్నబసవేశ్వరుని జ్ఞానము, బసవేశ్వరుని భక్తి పారవశ్యము, ప్రభుదేవుని వైరాగ్యము, వేదయ్య కటువిడంబనలు చిత్తాన్ని ఆకర్షించేవిగాను, హృదయాన్ని పులకరింపజేసేవిగాను ఉంటాయి. సాహిత్యం విద్వాంసులైన వారికి మనోరంజకమే గాక సామాన్య జనాన్ని తన ఉదాత్త ఉద్దేశ్యంతో ఆకర్షిస్తుంది అనే విషయాన్ని వీరి వచన సాహిత్యం నిజమని నిరూపించినది. కన్నడ భాషలో వేదము, ఉపనిషత్తులవలె అర్థ గర్భితము, తేజోమయము అయిన ప్రవాహం ఇదిమిది ఉన్నది. అంతేకాదు. వచన సాహిత్యంలో అనుప్రాస మొదలయిన శబ్దాలంకారాలు, ఉపమ, రూపక, ఉత్ప్రేక్ష మొదలయిన అర్థాలంకారములు గల సుందరమయిన ప్రయోగాలను అక్కడక్కడ మనం చూడవచ్చును గుణానికి ప్రాధాన్యత నిచ్చే వచన సాహిత్యానికి ఒక ముఖ్యమైన అంగంగా భావించబడు తున్నది. కవి హృదయము, వ్యక్తిత్వము కన్నడ సాహిత్యంలో అభివ్యక్తీకరింప బడినంత ప్రస్ఫుటంగా ఇతర సాహిత్యాల్లో మనకు గోచరించదు.

*నాగచంద్రుడు* (సుమారు 1100) : నాగచంద్రుడు ఈ యుగపు మహాకవుల్లో ఒకడు. అభినవ పంపకవితా మనోహర, సాహిత్యధర మొదలైనవి ఈయన బిరుదములు. బీజాపురం ఈయన నివాసస్థానము. ఈయన రామచంద్ర చరిత పురాణము, మల్లినాథ పురాణము అనే రెండు మహాకావ్యాలు వ్రాశాడు. ఈయన రామచంద్ర పురాణము పంపరామాయణము అనే పేరుతో ప్రసిద్ధి పొందినది. ఈ కావ్యము చంపూరూపములో ఉన్నది. దీనిలో జైన సాంప్రదాయ ప్రకారం రామాయణకథ వ్రాయబడింది. వాల్మీకి రామాయణ, పంపరామాయణ కథలలో చాల భేదములున్నవి. పంపరామాయణములో పుత్రకామేష్టియాగ ప్రసక్తి లేదు. రాముని తల్లి అపరాజిత. సుమిత్రకు లక్ష్మణు డొక్కడే పుత్రుడు. శత్రుఘ్నుని తల్లిపేరు సుప్రభ. లక్ష్మణునికి ఉపేంద్రుడు, వాసుదేవుడు అనే పేరులు కూడా ఉన్నవి. లక్ష్మణుడే ముఖ్యమైన కథానాయకుడు. రాముని దేహవర్ణము ఎరుపుగాను, లక్ష్మణుని దేహవర్ణము శ్యామలముగాను వర్ణింపబడినవి. విశ్వామిత్రుని ప్రసక్తి లేదు. పంపరామాయణంలోని రాముడు ఏకపత్నీ వ్రతుడు కాడు. సుగ్రీవుడు దధిముఖ నగరరాజు, రత్నపురి రాజుల పుత్రికలను వివాహమాడుతాడు. సుగ్రీవుని సోదరియైన శ్రీప్రభను రావణుడు పెండ్లాడుతాడు. రావణుని సోదరి చంద్రనఖ పుత్రికయైన అనంగ పుష్పను హనుమంతుడు పెండ్లాడుతాడు. లక్ష్మణుడు

తన విజయ యాత్రలో అనేక వివాహాలు చేసుకుంటాడు. రావణుని లక్ష్మణుడే సంహరిస్తాడు. లవకుశులు జన్మించిన తర్వాత సీత అగ్నిప్రవేశం చేసి అవతారాన్ని చాలిస్తుంది. ఈ కావ్యం లోని శబ్దాలంకారాల్లో అనుప్రాస యమకము మొదలైనవి, అర్థాలంకారాల్లో ఉపమ రూపకముల వంటివి అర్థాంతరన్యాస, ఉత్ప్రేక్ష మొదలైనవి ఉపయోగించ బడినవి. శాంతరసానికి ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఈ కావ్యంలోని పదబంధం సులలితంగాను, మనోహరంగాను ఉంటుంది. మచ్చుకు రామవిలాపం చూడండి. "కలహంసాలసయానేయం మృగమదామోదాస్య విశ్వాసేయం తరెరే తావరెయే మదాళి కులమే కర్ణేయదిలే మత్త కోకిలమే కండిరే పల్లవాధరేయ వంబోజాస్యేయం భృంగకుంతళేయం కైరవ నేత్రేయం పికరవ ప్రఖ్యాతేయం సీతేయం." ఓ కిసలయమా! నీవు పల్లవాధరను చూచితివా? ఓ కలహంసా! నీవు అలస గమనను చూచినావా? ఓమత్త భ్రమర కులమా! మీరు భృంగ కుంతలను చూచితిరా? ఓ నీలోత్పలా! నీవు కైరవ నేత్రను చూచితివా? ఓ కమలమా! నీవు కమల ముఖిని చూచినావా? అలస గమనం కలహంసతో సమానంగాను, సుందర నేత్రాలు నీలోత్పలాలుగాను ఈ వర్ణనలో చిత్రించ బడినాయి.

*రుద్రభట్టు* (సుమారు 1180): రుద్రభట్టు జగన్నాథ విజయమనే కావ్యానికి కర్త. ఈయన వైష్ణవ సాంప్రదాయము వాడు. బ్రాహ్మణ మహాకావ్య కర్తలలో రుద్రభట్టు ప్రథముడు. ఈ కావ్యము చంపూరీతిలో నున్నది. ఈ కావ్యంలో శ్రీ కృష్ణుని జన్మ మొదలు బాణాసురునితో యుద్ధము వరకు గల విష్ణుపురాణకథ వ్రాయబడినది. కవి తన కావ్యాన్ని "అనవద్యరీతిచోద్యం సకల విబుధహృద్యం" అని అభివర్ణించాడు. తన కావ్యంలో పురాతన జైనమత శైలిని అనుసరించాడు. రుద్రభట్టు సంస్కృత భాషలోకూడ అసాధారణమయిన పాండిత్యముకలవాడు. ఈ కావ్యంలోని మొదటి 5 పద్యాలు చాలా క్లిష్టంగా ఉండడంచేత సంస్కృతభాషలోగాని వీనికి వ్యాఖ్య వ్రాయుటకు వీలులేక పోయినది. విద్వజ్జనులలో ఈ కావ్యానికి మిగుల ప్రశస్తి కలదు. ప్రతి పద్యంలోను సుందరము, మధురము అయిన రచన గోచరిస్తుంది. కవి తన కవిత్వాన్ని గూర్చి ఇలా వ్రాశాడు.

"ప్రియతమ స్పర్శవలె నవీన చూతవృక్ష శోభవలె, చందన రస విలేపనమువలె, పుష్పించిన మల్లికా లతవలె, పూర్ణిమ చంద్రుని కాంతివలె, శీతలమలయానిలాగమనమువలె రుద్రభట్టు కవిత్వం సజ్జనుల మనస్సును చూరగొంటుంది."

*జన్నకవి చక్రవర్తి* (సుమారు 1209): జన్నకవి యశోధర చరిత్రము, అనంతనాథ పురాణాల కృతికర్త. ఈయన రాజా జనార్దన దేవుని ఆస్థానకవి. దండాధీశుడు, మంత్రి కూడాను. రాజావీరబల్లాళుడు ఈ కవికి 'కవిచక్రవర్తి' అనే బిరుదిచ్చాడు. మధురుడు జన్న కవిని కన్నడ కవిత్వ సీమాపురుషుడు అన్నాడు. ఈ ప్రశంస యథార్థముకూడాను. కావ్యం కంద పద్యంలో వ్రాయబడింది. ఈ కవిత్వంలోని భాష సరళమైనది. శైలి మిగుల సుందరమయినది. ఈ కావ్యములోని వర్ణనాభాగాలు మిగుల సుందరమైనవి. ఉపమా, దృష్టాంతాలంకారాలు చిత్తాకర్షకములు. కవిత్వ బంధం అతిలలితము.

**అంతయ్య (సుమారు 1235)** : అండయ్య కబ్బిగర కావ్యకర్త. ఈయన జైన కవి. ఈయన తన కావ్యాన్ని శుద్ధ కన్నడ భాషలో వ్రాసినాడు. సంస్కృతపండితులీ కావ్యాన్ని 'మదనవిజయం' అంటారు. ఈ కావ్యానికి 'సంస్కృత సహోదరీ' అనే రెండవ పేరుకూడా వుంది. అనేకచోట్ల తద్భవ శబ్దాలు ప్రయోగించబడినాయి. ఈ కవి తద్భవ శబ్దాలను శుద్ధ కన్నడ శబ్దాలనినాడు. శుద్ధ కన్నడ శబ్దాలతో శ్లేషాలంకారము, విరోధాభాసాలంకారములను ప్రయోగించడానికి సాహసించాడు. ఈ కావ్యంలోని కన్నడ దేశ వర్ణనము మిగుల సుందరమైనది. కావ్యంలో సులలితము, మధురమునైన ప్రవాహం ఉన్నది.

ఈ యుగపు సత్కవులలో చౌండరసుడు ఒకడు. ఈయన బ్రాహ్మణ కవి. ఈయన గ్రంథాలలో 'అభినవ దశకుమార చరిత్రము' 'నలచరిత్రము' మాత్రము దొరికినవి. కాని బాణాసుర విజయము దొరక లేదు. ఈ కవి తన దశకుమార చరిత్రాన్ని పండరినాథుడగు అభంగ విఠల్‌కు అర్పించాడు. గద్యంలో వ్రాయబడిన మూల కథను కవి చంపూరూపంలో వ్రాశాడు. దండి వ్రాసిన దశకుమార చరిత్రంలోను ఈయన వ్రాసిన దశకుమార చరిత్రంలోను భేదము కలదు. కవి జైన శైలిని అనుకరించాడు.

ఈ యుగపు కవియైన నరహరి తీర్థుడు మాధ్వకవి. ఈయన విష్ణుస్తుతి చేస్తూ గీతాలు వ్రాసినాడు. కర్ణపార్యుడు వ్రాసిన మాలతీ మాధవము, కేశరాజ్ వ్రాసిన సుభద్రా పరిణయము నాటకాలవలె మున్నవని చరిత్రకారులంటారు. ఈ యుగపువాడే ఐన శ్రీధరాచార్యుడు (సుమారు 1049) జాతకతిలక్ అనే జ్యోతిష గ్రంథాన్ని వ్రాసినాడు. ఇది జ్యోతిషశాస్త్రంలోని ప్రథమ గ్రంథమని భావింపబడుతున్నది.

— అనువాదం : వి. వేం. సుబ్రహ్మణ్యం.

# విద్యాశాఖామాత్యులకు మెమోరాండము

*(హైదరాబాదు హిందీ ప్రచారసంఘ పక్షమున శ్రీ స్వామీ రామానంద తీర్థ, శ్రీ రామకృష్ణధూత్, శ్రీ మండి జగన్నాథం, శ్రీ యస్. వి. శివరామశర్మ. శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారలు హైదరాబాదు ప్రభుత్వ విద్యాశాఖామాత్యులకు అందజేసిన మెమోరాండము.)*

## 1. హిందీబోధన ప్రారంభము

ప్రస్తుతం ఈ రాష్ట్రములోని అన్ని పాఠశాలలలోను హిందీ మాతృభాషకాని విద్యార్థులందరికీ మూడవ తరగతి నుండియే హిందీ నేర్పటం జరుగుతున్నది. 4, 5 తరగతులు ప్రాథమిక దశ లేక బేసిక్ దశలోనే చేరుతున్నవి. హిందీ ప్రాంతీయ భాష కానట్టి మరి యే రాష్ట్రంలోనూ యింత చిన్న తరగతులలో హిందీ ప్రవేశపెట్టబడలేదు. హిందీ భాషకు చాలా

సన్నిహితమైన బెంగాలీ, గుజరాతీ భాషా ప్రాంతాలలోగూడా, హిందీ మాధ్యమిక స్థాయిలోనే ప్రవేశపెట్టబడినది. ద్రవిడభాషలైన తెలుగు, కన్నడము, తమిళము, మళయాళము మాట్లాడు దక్షిణ భారత మంతటా హిందీ ప్రాథమికతరగతులలో బోధింప బడుట లేదు.

కాని మన రాష్ట్రంలో హిందీని మూడవ తరగతిలోనే ప్రవేశపెట్టి వారానికి నాల్గు పీరియడ్లు కేటాయించ బడుతున్నవి. మన ప్రాంతీయ భాషలైన తెలుగు, కన్నడము, మహారాష్ట్రము ఇంకా తగినంత అభివృద్ధికి రాలేదు అను సంగతి మనం గమనిస్తూనే ఉన్నాము. మన పిల్లలు ఇప్పుడిప్పుడే తమతమ మాతృభాషలను చదువ ప్రారంభిస్తున్నారు. అట్టి స్థితిలో ప్రాథమిక దశలోనే రెండవభాష నిర్బంధముగా ప్రభుత్వం బోధింప మొదలు పెడుతున్నది. ప్రాథమిక దశలో మాతృభాషతప్ప యే ఇతర భాషకూడా వీలైనంతవరకు బోధించ కూడదని మా అభిప్రాయము.

ఈ సందర్భములో రాజభాషయైన హిందీని మాధ్యమిక స్థాయిలోనే ప్రవేశపెట్టవలెనని కేంద్రీయ విద్యా సలహా సంఘము, సెకండరీ ఎడ్యుకేషన్ కమీషన్ మరియు అంతర్జాతీయ విద్యావేత్తల సంఘము చేసిన సిఫారసులను మీ దృష్టికి తెస్తున్నాము. •

పైన పేర్కొన్న సంస్థల సిఫారసులకు వ్యతిరేకంగా, నూతనంగా పునర్నిర్మాణం చేయబడ్డ విద్యా విధానంలో, హిందీ బోధన నాల్గవ తరగతిలోనే ప్రారంభించబడ వలెను అని **Special Implementation Committee** వారు సిఫారసు చేసినట్లు తెలియ వచ్చినది. ఈ నాల్గవ తరగతి ఇప్పటి ప్రాథమిక పాఠశాలలలోని మూడవ తరగతి కాగలదు. దీనినిబట్టి

---

*• ఉయిచేసిన సెకండరీ ఎడ్యుకేషన్ నివేదికపై అంతర్జాతీయ విద్యావేత్తల సంఘం వ్యక్త పరచిన అభిప్రాయాలను చూడగలరు—పుట 71 చూడుడు. సెకండరీ ఎడ్యుకేషను కమిషను నివేదిక నుండి ముఖ్యమైన అంశాలను పొందుపరచుచున్నాము.*

*1. విద్యార్థి తన మాతృభాషను ఇదివరకు నేర్చియుండి, ఇతరములు కూడా నేర్చుమంచు స్థితిలో సీనియర్ బేసిక్ లేక మాధ్యమిక దశలో హిందీ మరియు ఇంగ్లీషు భాషలను ప్రవేశ పెట్టవచ్చును.*

*2. భాషను అభ్యసించే ఉద్దేశ్యాల విషయంలో పై నివేదికలో ఇలా ఉంది. 'ప్రతిభాషనూ అభ్యసించడంలో ఒక నిశ్చితమైన ఉద్దేశ్యం ఉండవలె ననుట మాకు సమ్మతమే. ప్రారంభ దశ నుండి మాతృభాషయే బోధనా భాషగా ఉండడానికి తగినదని అందరూ అంగీకరించిన సూత్రం. ఒక ప్రత్యేక ప్రాంతంలో నివసించే అధిక సంఖ్యాకజనులు ఆ ప్రాంతీయ భాషనే మాట్లాడటం కద్దు. కనుక ప్రాంతీయ భాషా పరిచయం కూడా వాంఛనీయం.'*

*3. ఇక హిందీ విషయంలో అది కేంద్ర ప్రభుత్వానికినీ, కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలకునూ అధికార భాష కానున్నది. కనుక ప్రతి విద్యార్థికి మాధ్యమిక దశలో హిందీయొక్క ప్రాథమిక జ్ఞానం సంపాదించే అవకాశం కల్పించవలెను. ఆ భాషా జ్ఞానాన్ని అవసరాన్నిబట్టి వృద్ధిపరచుకొనడం ఆ విద్యార్థికే వదలి వేయాలి. ఈ కారణంగానే హిందీని మాధ్యమిక తరగతులలో, లేక సీనియరు బేసిక్ తరగతులలో నేర్పవలెను.*

ప్రస్తుత పరిస్థితులలో బేసిక్ పాఠశాలలందు హిందీ భాషాధ్యయనము ప్రారంభించే దశలో మార్పు ఉండబోదనుట విదితము. ఈ సిద్ధాంతాన్ని మేము అంగీకరించము. హిందీ మాతృభాషకాని విద్యార్థులు, దానిని మాధ్యమిక (సీనియర్ బేసిక్) తరగతులలోనే రెండవ భాషగా అభ్యసించవలెనను పై విద్యావేత్తల, సంఘాల అభిప్రాయంతో మేము సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాము.

విద్యావేత్తల అభిప్రాయం ప్రకారం నవీన సెకండరీ విద్యా విధానంలో హిందీ 6 వ తరగతి లేక 7 వ తరగతిలో మాత్రమే ప్రవేశపెట్టవచ్చుననుట స్పష్టము. మన రాష్ట్రంలోని మూడు భాషా ప్రాంతాల విద్యార్థులను మొట్టమొదట తమతమ మాతృభాషలను వీలైనంత ఎక్కువగా నేర్చుకొనవలసి యున్నది. ఆ తర్వాత రాజభాష నేర్చుకోవడం సులభం కాగలదు. కనుక అహిందీ ప్రాంతాల విద్యార్థులు హిందీని 6 వ తరగతినుండియే అభ్యసించేటట్లు చేయవలెనని, అంతకంటె పూర్వము మూడవ తరగతిలోగానీ, నాల్గవ తరగతిలోగానీ హిందీ ప్రారంభించరాదని మేము కోరుతున్నాము.

## 2. బోధనా భాష (Medium of Instruction)

పోలీసు చర్యకు పూర్వము హైదరాబాదు రాష్ట్రంలోని ప్రభుత్వ పాఠశాలలందు హిందీ బోధించడం జరిగేదికాదు. హైదరాబాదు సికిందరాబాదు నగరాలలోని హిందీ మాతృభాషగాగల విద్యార్థుల కొరకై, ప్రభుత్వేతర సంస్థలచే నిర్వహింపబడు హిందీ ప్రాథమిక పాఠశాలలు పరిమిత సంఖ్యలో ఉండేవి. కొన్ని ఆర్యసమాజ సంస్థలు తమ ఉద్యమంలో ఒక అంగంగా హిందీ పాఠశాలలను నిర్వహిస్తూ ఉండేవి. హైదరాబాదు భారతసమాఖ్యలో చేరినతర్వాత, మన రాజ్యాంగం హిందీని రాజభాషగానూ, దేవనాగరిలిపిని అధికార లిపిగానూ గ్రహించిన తర్వాత, 1950 లో ప్రభుత్వ పక్షాన హిందీ బోధించడం ప్రారంభమైనది. ఈ రాష్ట్రం భారత సమాఖ్యలో చేరకపూర్వం ఇచ్చట ఉర్దూకు అసాధారణమైన ప్రముఖస్థానం ఇవ్వబడి తెలుగు, కన్నడ, మహారాష్ట్రి భాషలు పూర్తిగా ఉపేక్షచేయ బడ్డవి. ఫలితంగా రాష్ట్రంలోని మూడు ప్రాంతాలవారు, పరిసర ప్రాంతాల వారికన్న తమతమ మాతృభాషలను అభివృద్ధి చేసుకోవడంలో వెనుక పడ్డారు. పరిస్థితులు మారగానే ఇంచుమించు రాష్ట్రములోని అన్ని పాఠశాలలలోనూ ప్రాంతీయ భాషలలో విద్య నేర్పడం ప్రవేశపెట్టబడినది. మాతృభాషను అభ్యసించడం, ఆ భాషలోనే విద్యాబోధన జరగడం ప్రాథమిక మాధ్యమిక తరగతులలో ఒకేసారి అమలు జరప బడినది. ప్రస్తుతం సికింద్రాబాదు, హైదరాబాదు నగరాలలో తప్ప, ఇతర జిల్లాలలోని అన్ని పాఠశాలలలోనూ మాతృభాష ద్వారానే విద్యాభ్యాసం జరగాలనే సూత్రాన్ని ఈ రాష్ట్ర ప్రభుత్వం కూడా అంగీకరించినది. అయినప్పటికీ, ఇంగ్లీషు బోధనా భాషగాగల కొన్ని పాఠశాలలలోవలె, హిందీ మాతృభాషగా లేని విద్యార్థులకుకూడా, హిందీ ద్వారానే విద్య గరపటానికి కొన్ని ప్రాథమిక, ఉన్నత పాఠశాలలు అనుమతింప బడ్డవి. మాతృభాష ద్వారానే విద్యాబోధన జరగవలెననే సూత్రాన్ని ప్రభుత్వ, ప్రభుత్వేతర పాఠశాలలు కొన్ని అమలు పరచటం లేదని తెలియ వచ్చినది.

హిందీకి ప్రాముఖ్యత రావాలనే దృష్టితో చేసిన ఈ సడలింపు వాంఛనీయం కాదని మా అభిప్రాయం. బ్రిటిషువారి రోజులలో భారతీయభాష లన్నింటికీ విఘాతం కలిగించి ఇంగ్లీషు బోధనా భాష అయినట్లే, హిందీ కూడా రానురాను అలాంటి స్థానాన్ని ఆక్రమించగలదు. ఆ స్థితిలో ప్రజలు హిందీని వ్యతిరేకించవచ్చును. కనుక అఖిల భారత కాంగ్రెసు కమిటీవారును, కేంద్ర ప్రభుత్వం వారు, భాషా విషయంలో ఏర్పరచుకొన్న సిద్ధాంతాన్ని మీ దృష్టికి తేదలచినాము. తదనుసారంగా ఉన్నత పాఠశాలలలోనే కాక, విశ్వవిద్యాలయాలలోను మాతృభాషయే బోధనా భాషగా అభివృద్ధి చెందవలసియున్నది. హిందీ రెండవ భాషగానే అభ్యసింప బడవలెను. హిందీని రాజభాషగా అభివృద్ధి చేయాలనే ఉత్సాహంలో ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలలో జరుగుచున్న పొరపాట్లను సరిదిద్ద వలసినదని మేము కోరుచున్నాము. ప్రత్యేక పరిస్థితులలో, అవసరాన్నిబట్టి కొద్దిపాటి సడలింపు చేయవచ్చును. కాని సర్వ సాధారణంగా హిందీ మాతృభాషగాని విద్యార్థులు హిందీ ద్వారా విద్యను అభ్యసించటాన్ని నిషేధించవలెను. విద్యాశాఖ ఈ సూత్రాన్ని కఠినంగా అమలు పరచవలెను.

## 3. ప్రాంతీయ భాషాధ్యాసం

ప్రస్తుత విద్యావిధానంలో, హిందీ మాతృభాషకాని విద్యార్థులకు హిందీ రెండవ భాషగా విధిగా నేర్పబడుతున్నది. ఏ ప్రాంతీయభాషయు మాతృభాషగాని విద్యార్థులకు తెలుగు, కన్నడము, మహారాష్ట్రములలో ఏదైనా ఒకటి నిర్బంధ ద్వితీయ భాషగా బోధింపబడుతున్నది. ఈ ప్రకారం రాజభాషయైన హిందీ, ప్రాంతీయ భాషలలో ఏదైనా ఒకభాషా, (అది మాతృభాష కానివారికి) ఈ రెండూ ఒకే వర్గంలో చేర్చబడి, రెండవ భాషలుగా పరిగణింపబడి అన్నీ ఒకేస్థాయిలో అనగా మూడవ తరగతిలోనే ప్రవేశపెట్టబడి పదవ తరగతి వరకూ ఒకే రకమైన పాఠ్య ప్రణాళికతో బోధింపబడుతున్నవి. రెండవ భాషాధ్యాసం యొక్క ఉద్దేశాన్ని పరిశీలించి చూచినప్పుడు, హిందీ, ప్రాంతీయభాషా రెండూ ఒకే వర్గంలో చేర్చబడటం ఉచితం కాదు. కేంద్ర విద్యాసంఘంవారు ప్రాంతీయభాష మాతృభాషగా లేని అల్పసంఖ్యాకుల విషయంలో, ఆ ప్రాంతం ప్రాంతీయ భాషను సాధారణ పాఠ్య ప్రణాళికలో చేర్చవలసినదని సిఫారసు చేసినారు. ప్రాంతీయభాష అంటే ఆ ప్రాంతంలో నివసించే అధిక సంఖ్యాకుల భాష కాబట్టి, అదే ఆ ప్రాంతానికి రాజభాషగా కూడా కావచ్చు; కనుక, ఆ ప్రాంతంలో నివసించే జనులకు (ఆ ప్రాంతీయ భాష మాతృభాషకాని వారికి) ఆ భాషలో తగినంత జ్ఞానం కలుగడం అవసరం. ఈ సందర్భంలో కేంద్ర విద్యాసలహా సంఘం వారి సిఫారసును దిగువ పొందుపరచుచున్నాము.

"జూనియరు బేసిక్ దశలో మాతృభాషయే బోధనా భాషగా ఉండవలయును. ఒకవేళ, ఆ ప్రాంతీయ భాషకంటె భిన్నమైన భాష మాతృభాషగాగల కనీసము నలుభైమంది విద్యార్థులొక పాఠశాలలో ఉన్నట్లయితే, అలాంటి వారికి వారి మాతృభాష బోధించుటకు ఒక ఉపాధ్యాయుని నియమించి సౌకర్యం కలుగజేయవలెను. ప్రాంతీయ భాష మాతృభాషకన్న భిన్నమైన దయితే, దానిని 3 వ తరగతిలోనైనా లేక జూనియరు బేసిక్ దశాంతంలోనైనా

ప్రవేశపెట్టవలెను. అలాంటి విద్యార్థులకు సెకండరీ దశలో ప్రాంతీయభాష మాధ్యమము లోనికి మారడానికి అనువగునట్లుగా చూస్తూ, జూనియర్ బేసిక్ దశ తర్వాత రెండేండ్లవరకు తమ మాతృభాషలో పరీక్ష పత్రాలు వ్రాసే అవకాశం కల్పించాలె."

అల్పసంఖ్యాక వర్గపు విద్యార్థులు ఆ యా ప్రాంతపు రాజభాష అయిన ప్రాంతీయ భాషలో తగినంత జ్ఞానము సంపాదించడానికి గాను, అవకాశము కల్పింప బడవలెనని పై సలహా సంఘంవారు సిఫారసు చేసినట్లు స్పష్టం కాగలదు. ఆలా అయినప్పుడు ఆ విద్యార్థులు సులభంగా సెకండరీ దశలో ప్రాంతీయ భాష మాధ్యమమునకు మారగలరు. మరాట్వాడాలో నివసించే కన్నడిగులను, తెలంగాణాలో ఉండే మహారాష్ట్రులను రాజభాషయైన హిందీనే కాక ఆ ప్రాంతీయభాషను కూడా నేర్వవలసి ఉంటుంది కనుక ఈ రెండు విధాలైన భాషలను ఒకే వర్గంలో చేర్చడం ప్రయోజనకారి కాజాలదు. ఎట్టిపరిస్థితులలోను హిందీని ప్రాంతీయ భాషాభ్యాసానికి ముడిపెట్టుట సమంజసం కాదు. దాని ఉద్దేశ్యమే భిన్నమైనది. హిందీ విషయంలో, మాధ్యమికదశయందు ప్రారంభిక జ్ఞానం సంపాదించడం చాలును. ఉన్నత తరగతులలో అవసరాన్నిబట్టి విద్యార్థి ఆ జ్ఞానాన్ని వృద్ధిచేసుకుంటాడు. కాని ప్రాంతీయ భాషావిషయంలో, అల్పసంఖ్యాక వర్గానికి చెందిన విద్యార్థి అజ్ఞానాన్ని అధిక సంఖ్యాకవర్గ విద్యార్థులతో సమానంగా దైనందిన వ్యవహారానికి అవసరమైనంత సంపాదించ వలసి ఉంటుంది. కనుక ప్రస్తుతం మనరాష్ట్రంలో ఉన్న పద్ధతిని పునః పరిశీలన చేయవలెను.

## 4. రెండవ భాషయైన హిందీపాఠ్య ప్రణాళిక

హిందీకిని, ప్రాంతీయ భాషలకును పాఠ్యక్రమమును తయారుచేయు ప్రణాళికా సంఘా లున్నవి. 1950 లో సెకండరీ విద్యా ప్రణాళికలో ప్రాంతీయ భాషలు చేర్చబడినప్పటినుండీ ఈ సంఘాలు పనిచేస్తున్నా తగిన పాఠ్యప్రణాళికలు నేటివరకూ సిద్ధం చేయబడక పోవడం విచారకరం. ప్రస్తుతమున్న పాఠ్య ప్రణాళికలో ప్రథమ భాషకై సిద్ధము చేయబడ్డ భాంశమే ఆదే భాష రెండవ భాషగా బోధింపబడేటప్పుడు మూడవ తరగతిలో ఉపయోగింపవలెననీ, అట్లే మొదటి భాషకై సిద్ధంచేయబడ్డ పాఠ్య ప్రణాళిక రెండు మూడు తరగతుల తేడాతో, రెండవ భాష కొరకు కూడా ఉపయోగింప బడవలెననీ వ్రాయబడి ఉన్నది. ఇదే సిద్ధాంతం ప్రకారం ప్రస్తుతం హిందీ మాతృ భాషగాగల విద్యార్థుల కొరకు వ్రాయబడ్డ పాఠ్య పుస్తకాలు, హిందీ మాతృభాషకాని విద్యార్థులకు, ఉపయోగింప బడుతున్నవి. రాష్ట్రంలోని వివిధ విద్యాసంస్థలలో పనిచేసే ఉపాధ్యాయుల అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ పద్ధతి లోపభూయిష్ఠమైనదనీ, రెండవ భాషా బోధన పద్ధతుల సిద్ధాంతాలకు వ్యతిరేక మైనదనీ మేము చెప్పగలము. కనుక హిందీని రెండవ భాషగా బోధించడానికి వేరు విధమైన పాఠ్య ప్రణాళికలను ఆయా తరగతుల కొఱకు సిద్ధం చేయించాలని మా అభిప్రాయము. ఉన్నత విద్యాభ్యాసంలో కాకున్నా, ప్రారంభదశలో 4, 5 సంవత్సరాల దాకా, మాతృభాషగా బోధింపబడే హిందీకిని, రెండవ భాషగా బోధింపబడే హిందీకిని, పాఠ్య ప్రణాళికలో భేదం తప్పక పాటించవలెను. ఈ సిద్ధాంతాన్ని దిగువ స్పష్టంగా వివరిస్తున్నాము.

(1) మాతృ భాషను అభ్యసించేటప్పుడు విద్యార్థికి ఆ భాషా పరిచయం అలవడే ఉంటుంది. అతడు నిత్యజీవితంలోని సాధారణ వ్యవహారాలకై తన మాతృభాషను వాడగలడు. అర్థం చేసుకోగలడు. బాల్యంనుండి చిన్న చిన్న భావాలను వ్యక్తం చేయడానికి కావలసిన పదజాలం కూడా నేర్చుకొని ఉంటాడు. పాఠశాలలో ప్రారంభ దశలో తనకు ఇది వరకు వచ్చిన శబ్దజాలాన్నే వ్రాయ నేర్చుకుంటాడు. కనుక అట్టి విద్యార్థికై వ్రాయబడే పుస్తకములలో పరిచితమునుండి అపరిచితంవైపుకు, సులభంనుండి క్లిష్టంవైపుకు, చిన్నభావాలనుండి కఠిన భావాలవైపుకు క్రమంగా తీసుకొనిపోయే పద్ధతి అనుసరింప బడుతుంది. ప్రత్యక్ష బోధనా పద్ధతి ద్వారా విద్యార్థి అధిక శబ్దజాలాన్ని గ్రహిస్తుంటాడు. క్రమానుసారంగా వ్రాయబడ్డ పాఠ్య పుస్తకాల సహాయంతో ప్రాచీన సాహిత్యాన్ని పరిచయం చేసుకుంటాడు. కాలక్రమేణా తన సాంఘిక, రాజకీయ, జీవిత రంగాలలోను, ఇతర రంగాలలోను భావ ప్రకటనకు మాతృభాషను ప్రధాన సాధనం అయ్యేటట్లు స్వాధీన పరచుకోవడం అతని అంతిమ లక్ష్యం.

(2) హిందీ మాతృభాషకాని విద్యార్థి పరిస్థితి భిన్నమైనదిగా ఉంటుంది. తాను నేర్చుకోబోయే భాషతో అతనికి ఏమాత్రమూ పరిచయం ఉండదు. అపరిచితంనుండి పరిచితం వైపుకు తీసుక పోవడానికి, అతనియొద్ద పరిచితమైన పదజాలమేదీ ఉండదు. మొట్ట మొదట అతడు తన పరిసరాలలోని అనేక సామాన్య వస్తువుల పేర్లను కూడా నేర్చుకొని, అతి సాధారణమైన భావాలను ప్రకటించడం అభ్యసించవలెను. అతనికి కావలసినది సాధారణ పదజాలం. సాధారణ భావ ప్రకటనకు అనువుగా భాషయొక్క మూల సూత్రాలను అతడు నేర్చుకొని తర్వాత క్రమంగా అభివృద్ధి చేసుకోవలెను. ఈ విధంగా ప్రాథమిక జ్ఞానం అలవరచుకొన్న తర్వాతనే గాని ఆ భాషలో అతడు ఉన్నతసాహిత్యజ్ఞానం సంపాదించ లేడు. అతని మాతృభాష భిన్నమైనది కనుక ప్రత్యక్ష బోధనా పద్ధతి ద్వారా వ్రాయబడ్డ వాచకాల సహాయంతో క్రొత్త భాషను నేర్చుకోలేడు. ప్రత్యక్ష పద్ధతితోపాటు అనువాద పద్ధతి కూడా అతడు అనుసరించక తప్పదు. మొదట 4, 5 వాచకాలలోని శబ్దజాలము, విషయము, వీని సహాయంతో నిత్యజీవితానికి సంబంధించిన సాధారణ అభిప్రాయాలు వ్యక్తంచేయడం నేర్చుకొంటాడు. సెకండరీ ఎజుకేషన్ కమీషన్ భాషలను బోధించే విషయంలో నిర్దిష్ట లక్ష్యం ఉండాలని నొక్కి చెప్పుతున్నది. ప్రత్యేకంగా హిందీ విషయంలో పై కమీషన్ తన నివేదికలో ప్రతి విద్యార్థికి సెకండరీ స్థాయిలో హిందీ యొక్క ప్రాథమిక జ్ఞానం సంపాదించే అవకాశం కల్పించాలనీ, ఆ తర్వాత అవసరాన్ని బట్టి అతడు ఆ భాషను వృద్ధిచేసుకోవచ్చుననీ స్పష్టం చేసినది. హిందీని రెండవ భాషగా నేర్పడంలోగల ఉద్దేశ్యం అతనికి ప్రాచీన ఆధునిక హిందీ సాహిత్యజ్ఞానం కలిగించాలని కాదు. సాధారణ సంభాషణా జ్ఞానం కలిగించి నిత్య వ్యవహారంలో విద్యార్థి దానిని వాడుకొనేటట్లు చేయడమే. పాఠ్య ప్రణాళిక సిద్ధం చేయడంలో ప్రభుత్వం ఈ సూత్రాలను గమనించలేదు. కనుక పై సిద్ధాంతాలను దృష్టిలో ఉంచుకొని పాఠ్య ప్రణాళికను పూర్తిగా మార్చడం అవసరం.

## హిందీ సంఘాలు — పాఠ్య పుస్తకాలు :

(1) హిందీ ప్రణాళిక అమలు జరపడంలో, సలహాలిచ్చి తోడ్పడటానికి విద్యాశాఖచే నియమింపబడిన సంఘా లెన్నో ఉన్నవి. వివిధ విషయాలపై ఇలాంటి ప్రత్యేక సంఘాలను నిర్మించడం ఎంతో ఉపయుక్తమైన పద్ధతే. కాని అనుకొన్న ఫలితాలు ఈ సంఘాల వల్ల కలుగుతున్నట్లు లేదు. కారణం ఆ సంఘాలకు సభ్యులను ఎన్నుకోవడంలో ప్రభుత్వం తగిన శ్రద్ధ వహించక పోవడమే. కనుక ఈ రంగంలో పనిచేసే ముఖ్యమైన సంస్థలకు తగినంత ప్రాతినిధ్యం ఇస్తూ అధికారేతర సభ్యులను, అధికార సభ్యులను పై సంఘాలలో సభ్యులుగా ఎన్నుకోవాలని మేము సూచిస్తున్నాము. అలా ఎన్నుకోబడే సభ్యులకు హిందీ భాషలో గల ప్రత్యేక యోగ్యత, వారి అనుభవం మున్నగు విషయాలను దృష్టిలో ఉంచుకో వలెను.

(2) ఇదివరలో ఒకసారి ఈ సంస్థ ప్రచురణ కర్తల కంపెనీలకు సంబంధించిన వారిని,-రచయితలను, సంకలన కర్తలను, పాఠ్య పుస్తకాలను నిర్ధారణచేసే సంఘాలలో సభ్యులుగా నియమింపరాదని ప్రభుత్వం దృష్టికి తెచ్చినది. సెకండరీ ఎడ్యుకేషనల్ బోర్డువారు ఈసిద్ధాంతాన్ని అంగీకరించి రచయితలు, సంకలన కర్తలు, ముద్రణ కర్తలు, ప్రచురణకర్తలు, ప్రచురణ కర్తల కంపెనీలతో ఆర్థిక సంబంధాలు కలవారు పాఠ్య గ్రంథాలు నిర్ణయించే కమిటీలలో సభ్యులుగా నియమింప బడరని పత్రికా ప్రకటన చేసి ఉన్నారు. కాని ఈ నియమము ఆచరణలో పూర్తిగా పాటింపబడ లేదు. ఇకముందు అయినను పాఠ్య గ్రంథాలు నిర్ధారణచేసే సంఘాల సభ్యులను ఎన్నుకోడంలో ఆ నియమాన్ని పూర్తిగా పాటించ గలరని ఆశిస్తున్నాము.

(3) హిందీ పాఠ్య పుస్తకాలు సిద్ధం చేయడంలోనూ, హిందీని మాతృభాషగానూ, రెండవ భాషగాను బోధించడంలోనూ గమనించ వలసిన ముఖ్యాంశములను లోగడ స్పష్టం చేసి యున్నాము.

ఈ మెమొరాండంలో పొందుపరచబడిన సలహాలను సహృదయతతో పాటింతురని ఆశిస్తున్నాము.



